శ్రీ

# నువ్వుకొండ యోగిరామశతకము






టెక్కలి
యాంగ్లేయోన్నత పాఠశాలా
సహోపాధ్యాయ

## మండలీక సీతారామయ్య

ప్రణీతము.

1941

 [వెల రూ. 0—4—0.

శ్రీ

# నువ్వుకొండ యోగిరామశతకము



పెక్కలి
యాంగ్లేయోన్నత పాఠశాలా
సహాయోపాధ్యాయ
మండలీక సీతారామయ్య
ప్రణీతము.

1941

వెల రూ. 0—4—0.

# విషయసూచిక.

# యోగిరామశతకము విషయసూచిక.



శ్రీరస్తు.

అవిఘ్నమస్తు.

# శ్రీ నువ్వుకొండ యోగిరామశతకము

## తొలిపలుకు

—•◆❀◆•—

### 1 ప్రార్థనాదికము

ఉ. శ్రీగిరిజావిలోల! నినుఁ ♦ జేరఁగఁబోయెడు భక్తయత్నముల్
సాఁగఁగనీని నీ సుతుఁడు ♦ సారములేనిప్రపంచమందుఁ బెన్
రాగ మెలర్పఁజేయుసతి ♦ రాయిడిఁ బెట్టుట మాన్పవయ్య నా
పైఁ గరుణించి నాదు కృతి ♦ భర్తవుగా నినుఁ జేసి
మ్రొక్కెదన్. 1

చ. అలరఁగ నంచ నెక్కి ప్రియు ♦ నంకముపై వసియించి కొంకుచున్
జెలువుని వామహస్తమును ♦ జీర చెఱంగునఁ జొన్పి వీఁకతోన్
వలనుపయంటఁ దుంబి నట ♦ నం బొనరింప నిజేశు సామగీ
తల నలరించి తా నలరు ♦ ధాతృనిరాణిని వాణిఁ గొల్చెదన్. 2

కం. కొలుతున్ భారతకవులన్
దెలుతున్ రామాయణ కవి ♦ ధీరుల భక్తిన్
దలఁతున్ బురాణకవులన్
బిలుతున్ సత్కవుల నా క ♦ విత మనుపంగాన్. 3

కం. వాల్మీకముఁ బద్యములుగ
మేల్మిన్ దెలిఁగించుచున్న ♦ మేదురభాషా
వాల్మీకి గరిమెళ్లాన్వయుఁ
బల్మాఱున్ రామమూర్తి ♦ బావ నుతింతున్. 4

తే. జానకీవర శతకరా ♦ జంబు చెప్పి
నాకవాసుల కన్నదా ♦ నంబు మహిమ
న్యాయవాదంబుఁ దెలుపఁగ ♦ నరుగు మాజ
యంతి కామేశపంతుల ♦ నభినుతింతు. 5

తే. కాళహస్తీశ్వర శతక ♦ కర్త ధూర్జ
టివరు, భక్తచింతామణి ♦ కవిని సుబ్బ
రాయుఁ, బురుషోత్తముని, సోము, ♦ రామదాసు
నితర శతకకవీంద్రుల ♦ నెదఁ దలంతు. 6

కం. నా తల్లిని గామమ్మను
నా తండ్రిని సోమయాజి ♦ నతిజేతున్ నే
నాతతభక్తిన్ దలఁతున్
బ్రీతిన్ గనువారి, విద్య ♦ నేర్పినవారిన్. 7

సీ. నువ్వుకొండకు మైలు ♦ దవ్వునందుననుండు
కవితాగ్రహారంబు ♦ కాఁపురముగ

కొండూరు లక్ష్మయ్య ♦ యుండెను మా తాత
భార్య వెంకటలక్ష్మి ♦ భక్తిఁ గొలువ
నరసమ్మ, కామమ్మ ♦ ననువుగా వెంకమ్మ
యను ముప్వురమ్మలు ♦ జననమైరి
శైశవంబునఁ దల్లి ♦ స్వర్గస్థురాలైన
మేనత పారమ్మ ♦ మించిపెంచె

తే. నంత విద్యార్థి దినముల ♦ నన్నుమిడిరి
యనద లమ్మమ్మ పిన్నమ్మ ♦ లాదరమునఁ
దోడ నుండెఁ బారమ్మ; యు ♦ ద్యోగమైన
మొక్కవలె నేను వారికి ♦ మోదమెనయ. 8

తే. అతులితంబుగ నా సేవ ♦ లాచరించి
పరమసాధ్వి యన్ ప్రఖ్యాతి ♦ పరగి పరమ
పదమునొందు చల మన నా ♦ ప్రథమభార్య
వాణిని నిలుపుఁగాత నా ♦ వా కుక్కనందు. 9

## 2 శతకరచనకుఁ బ్రేరణము

కం. గరిమెళ వేంకటరామయ
వెరవరి హరిగిరి నివాసి ♦ వియ్యంకుఁడు తోం
దరపనిపై నెక్కలి వ
చ్చి రభసముగ నాతఁ డిల్లు ♦ చేరినపిదపన్. 1

కం. వక్షోవాతమువలన బ
లక్షయమై పెక్కునెలలు ♦ లబ్ధిన్ గనకే
పక్షంబులు దెగఁగఁ బడిన
పక్షిగనుండు ననుఁజూచి ♦ పలికెన్ బ్రేమన్. 2

తే. ఆంగ్లవైద్యు లిది కుదర్ప ♦ నరయరైరి
మీరు ఘనవైద్యులై యేమి ♦ మేలు కలిగె
పద్యముల యోగిరామునిఁ ♦ బ్రస్తుతింప
శీఘ్రముగ నగు నారోగ్య ♦ సిద్ధి యనుచు. 3

తే. అను నతని మ్రొక్కి యోగిరా ♦ ముని ప్రశంస
జేయ నెంచితిఁ బరమేశుఁ ♦ జక్కనంచుఁ
బోవని మన్నించనిమ్మని నా ♦ బొంది యింక
నేమిసేసితి నేఁబది ♦ యేండ్లు బ్రతికి. 4

## 3. నువ్వుకొండమాహాత్మ్యము

నువ్వుకొండమాహాత్మ్య మను వేఱొకగ్రంథము విపులముగా వ్రాసితిని గాన, నిచట మిక్కిలి సంక్షేపముగా వ్రాయుదును.

ఈ నువ్వుకొండకు వ్యావహారిక నామము బెండికొండ. దీనిని క్షేత్రసంజ్ఞగాఁ జెప్పినపుడు నువ్వుకొండ యందురు. ఇది విశాఖపట్టణముజిల్లా టెక్కలితాలూకా పాతటెక్కలి ఖండము జమీందారిలోఁ జేరియున్నది.

ఈ కొండ పూర్వ మిద్దఱు వర్తక సోదరుల నువ్వుల రాశి యఁట. వారు కృపణులై తిలప్రీతిదేవుఁ డగు శనైశ్చరుని దృప్తిపరుపకపోవుటచే నా దేవునకు నాగ్రహము గలిగి వారి నువ్వులరాశిని బర్వతరాజిగా నొనర్చెనఁట! అంతట వారు పశ్చాత్తప్తులై శనైశ్చరుని భక్తిచేఁ బ్రసన్నునిగాఁ జేసికొనగ నా దేవుఁడు, "తిరుగ నీ కొండ నువ్వులరాశిగా మార్పఁబడదు కాని మీకొఱకు నిటుపై నీ కొండ నావిశ్రాంతివాస మౌను గాన, దీనిం దర్శనము చేయువారికి సకలాపదలు పోయి సమస్తశుభములు గలుగునటుల మీకు వరమిచ్చితి" నని చెప్పి యంతర్ధాన మయ్యెను.

రామయోగిచరిత్ర— ఒకసాధువు రామభక్తుఁడై పెరుఁగే యాహారముగాఁ గలిగి మితభాషియై యీ కొండను దపస్సుచేసికొనుచు నలువది దినములకుఁ బైగా నిరశన వ్రతముఁ జేసి తే 4—3—1938 ది యందుఁ బరమపదము నొందెను. ఆ మునిపుంగవుని తపోమహిమచే నీ కొండ గొప్ప శ్రీరామక్షేత్రమై ప్రసిద్ధికి వచ్చి భక్తులకు సర్వశుభముల నిచ్చుచున్నది.

## 4. శ్రీనువ్వుకొండక్షేత్రపాలక శన్యష్టకము

### మత్తకోకిల.

శ్రీకరంబగు నువ్వుకొండ వి ♦ చిత్రమొప్పఁగ నీ కృపన్
నీకు శాంతి నివాస మౌ నని ♦ నిశ్చయంబుగఁబల్కుటన్
మాకు సర్వశుభంబు లిచ్చుచు ♦ మమ్ము రక్షణసేయుమీ
నీకు దండము పెట్టి మ్రొక్కితి ♦ నీదు శైలముఁగొల్వఁగాన్,

నీలవర్ణధరుండ వౌటను ♦ నీవెసూ హరి యాదు వీ
శైలవాసుఁడ వౌట నీ వల ♦ శంకరుండవు గా దఁటే
కాలరూపుఁడ నిన్నుఁ గొల్వఁగఁ ♦ గాదె కొల్చుట వారినిన్
గాలకాలమునమ్ముఁ బ్రోవుము ♦ కాలుఁడానిను మ్రొక్కెదన్

నిన్ను మ్రొక్కిన వారిపక్షము ♦ నీవు చేరుచు వారలున్
గన్నుగానక చేయుపాపముఁ ♦ గాచి రక్షణఁ జేతునం
చెన్నియో వచియించినావఁట ♦ యెన్న నేర్తుమె నీదయన్
మిన్నుముట్టిన నీనుకాదవ్రము ♦ మిగ్రింగి సౌమ్యుఁడ వైతివే.

లోకులెవ్వరు దీనిఁ దల్పని ♦ లోప మెంచుచు క్షేత్రమున్
లోకమెల్ల నెఱుంగు నట్టుల ♦ లోకవేద్యుఁడు రాముఁ డన్
బ్రాకటంబగుమూర్తి నిల్పితె ♦ పర్వతంబున నొప్పుగాన్
మాకు వే ఱోకచింత యేటికి ♦ మాటికిన్ మిముఁ గొల్వఁ కే. 4

శౌరి నీవును శౌరి వాఁడును ♦ సర్వసంపద లీయఁగన్
జేరి రిర్వురు నిచ్చుటన్ మిముఁ ♦ జేర్చి మ్రొక్క శనైశ్చరా
కారణం బిటులొప్ప నిద్దఱుఁ ♦ గారె సూర్యునిగోత్రికుల్
వేఱెకారణ మేమియుండును ♦ వేల్పులిద్దఱు కూడఁగన్.

భానుపుత్రులు నీవు ధర్ముఁడు ♦ భవ్యచర్యలుచూడఁగన్
బ్రాణి నీ విట శిక్షఁ జేతువు ♦ పాపకర్మకు నెంతయున్
దానునక్కడ శిక్షఁ జేయుఁగృ ♦ తాంతుఁ డెంతయుఁ బ్రేతలన్
జ్ఞానమున్ గలిగింప వారికి ♦ జ్ఞానదాతలు గావునన్. 6

నీదుశైలమునందు శ్రాద్ధము ♦ నిష్ఠతో సలుపంగఁగాన్
నీకుతమ్ముఁడు శ్రాద్ధదేవుఁడు ♦ నిక్కువంబుగ మెచ్చుచున్
మాదుపెద్దలశాంతిఁజూచుచు ♦ మక్కువన్ గడుఁ బ్రోచెడిన్
వేదవిద్య కతీత మయ్యెడు ♦ విద్య నిచ్చుచు వారికిన్. 7

ధర్మమూర్తివి ధర్మరాజవు ♦ ధర్మ మియ్యెడ నిల్పుమీ
కర్మదాయక కర్మకారక ♦ కర్మమెంచక నన్నిఁకన్
నర్మవాక్యము లాడుచున్ నను ♦ నర్మిలిన్ దగ నేలుమీ
మర్మముంచక నీలవర్ణ! న ♦ మస్కరించుచు వేఁడెదన్.

వందనంబు శనైశ్చరా! శని! ♦ వందనం బిదె, కృష్ణుఁడా!
వందనంబును జేతు నీకును ♦ వంత దీర్పఁగ వేగమే,
వందనం బిదె జ్ఞానదాయక! ♦ బంధమున్ విడదీయుమీ,
క్రిందుఁజేసితి నన్ను నీక్రియఁ ♦ గింకరున్ దయఁజూడుమీ. 9

శాంతిమందుఁడ శాంతికృష్ణుఁడ ♦ శాంతియంతక కావుమీ
శాంతిపింగళ శాంతిబభ్రువు ♦ శాంతిరుద్రుఁడ ప్రోవుమీ
శాంతినీలుఁడ శాంతికాలుఁడ ♦ శాంతిపంగుఁడ కావుమీ
శాంతిసౌరి శనైశ్చరా శని ♦ శాంతినిచ్చుచుఁ బ్రోవుమీ.10

మత్తకోకిల వృత్తముల్ శని ♦ మంగళంబుగ నా కిఁకన్
మత్తకోకిల రీతిగా నిటు ♦ మక్కువన్ మఱి పాడితిన్
విత్తమున్ మఱివైభవంబును ♦ వీఁకతోఁ దయసేయుమీ
ఎతి పాడిన వారికిన్ విన ♦ నేగువారికి నీ సుతిన్. 11

5 శ్రీ నువ్వుకొండక్షేత్రవాసి
శ్రీరామయోగి ద్వాదశమంజరిస్తోత్రము

ఆ. భక్తవరులకెల్ల ♦ భగవానుపైఁ జింత
దేశభక్తులకును ♦ దేశచింత
అల్పనరులకెల్ల ♦ నతివలపైఁ జింత
విశ్వదాభిరామ ♦ వినురరామ.

సీ. శ్రీరామ భక్తుఁడై ♦ చెలఁగుచు నువుకొండ
రాలసందున డాఁగు ♦ రామయోగి
రాముఁడేకాని వే ♦ ఱేమి లేదని చాటు
పూర్ణవైరాగ్యుఁడౌ ♦ పుణ్యమూర్తి
పెరుఁగుమాత్రమె త్రాగి ♦ పెనుతపస్సును జేసి
పరమాత్మనెఱిఁగిన ♦ పరమహంస
పదునెనిమిదియగు ♦ వందలేఁబదితొమ్మి
దిశక మీశ్వర ఫాల్గుణ ♦ శుచిపక్ష

తే. మందు విదియను భృగువాస ♦ రాపరాహ్ణ
మందు నలువదియేనునా ♦ ళ్ళనశనమున
బ్రహ్మపదమొంది తిలరాశి ♦ పర్వతమున
రాముఁడై వెలసెనుజూఁడీ ♦ రంజితముగ.

సీ. శ్రవణేంద్రియంబుల ♦ శబ్ద మేది పడిన
నది రామ రవమని ♦ యాలకించు
కనుదోయి కేదైనఁ ♦ గనఁబడునంతనే
యది రాముఁడే పోలు ♦ ననుచుఁ జూచు

స్పర్శేంద్రియమున కే ♦ వస్తువు దాఁకిన
　　నది రామునిస్పర్శయం ♦ చదరి పడును
ఘ్రాణేంద్రియంబున ♦ గంధమేదియు సోఁక
　　నది రాముని దనుచు ♦ నాశ పడును
తే. పిలువఁ బలుకును రాముఁడే ♦ పిలిచె ననుచు
అదుగో రాముఁడనుచుఁ బరు ♦ గిడుచు నుండు
కనఁబడక యుండినను వెతా♦ కుచను నుండు
రాజితవిరాగి నువ్వుకొండ ♦ రామయోగి. 2

సీ. నిరశనవ్రతమును ♦ నిష్ఠతో సలిపెడు
　　రామయోగిని గొల్వ ♦ రారె యిపుడు
పాపంబు లెడఁబాపు ♦ పావనమూర్తియౌ
　　రామయోగిని గొల్వ ♦ రారె యిపుడు
తనువెత్తినందుకుఁ ♦ దాపసోత్తముఁడైన
　　రామయోగిని గొల్వ ♦ రారె యిపుడు
తాపత్రయములెల్లఁ ♦ దరలించి వేవేగ
　　రామయోగిని గొల్వ ♦ రారె యిపుడు
తే. అనుచు నొండొరులఁ బిలిచి ♦ కొనుచు నీదు
కొండ నెక్కిరి వేవేలు ♦ గుంపుగూడి
దూరమనకను నిత్యంబు ♦ దోసిలొగ్గి
రామరామ యటంచును ♦ రామయోగి. 3

సీ. నిదురలేకుండుట ♦ నిక్కంబుగాఁ జూడ
　　ననిమిషవర్యుఁడ ♦ వగుదు వీవు
పెరుఁగుమాత్రమె గ్రోలి ♦ పెనుబలశాలివై
　　జిహ్వను గెలిచిన ♦ జినుఁడ వీవు

కాంతాకనకములఁ ♦ గామింప కెన్నఁడు
షడ్రిపులను జంపు ♦ స్వామి వీవు
శీతాతపములకుఁ ♦ జీకాకు నొందని
భూతముల జయించు ♦ బుధుఁడ వీవు
తే. నరుఁడవనఁగను నిన్నెట్లు ♦ నమ్మఁదగును
నీయమానుష చరితంబు ♦ నెఱయుచుండ
జనుఁడు యోగమున నగు నీ ♦ శ్వరుఁ డటంచు
నీ మహత్త్వముఁ జూపవె ♦ రామయోగి. 4

సీ. విషజంతువు కఱవ ♦ విష మెక్కి చావవు
జనుఁడ వెట్లగుదువు ♦ జంగమేశ
కొట్టవచ్చిననిన్ను ♦ కోపమింతయు లేదు
నరుఁడ వెట్లగుదువు ♦ నగనివాస
పిల్లఁ డిముడలేని ♦ బిలము నీ కిరవౌట
మనుజుఁ డెట్లగుదువు ♦ మహితకాయ
మ్రొక్కులు సఫలమై ♦ ముడుపు చెల్లుటఁ జూడ
మానిసి వెట్లౌదు ♦ మాన్యచరిత
తే. ప్రజలు వేవేలు త్రిదినముల్ ♦ ప్రణతు లిడుచు
నీ కళేబర ముంచరే ♦ వీఁకతోడ
శవమునకుఁ బూజ గలదటే ♦ సంయమీంద్ర
వామదేవ సమ విరాగి ♦ రామయోగి. 5

సీ. కాకిమూఁకలు మేఁత ♦ కై చేరు నీ యాన
నీ మహత్త్వెట్టిదో ని ♦ ష్కళంక
నీ క్షేత్రవంచకుల్ ♦ నిండరె నాపద
నీ మహిమ యదెంతో ♦ నిపుణహృదయ

అధ్వానమగు కొండ ♦ యగ్రగణ్యమ్మయ్యె
నీ గొప్పయెట్టిదో ♦ నిర్మలాత్మ
నీ నీమ శనివార మే ♦ నిండుజాతర
నీఘనత యదెంతో ♦ నియమశీల
తే. కొండలో నీ కళేబర ♦ ముండుటకును
గుండమును దీయుచుండఁగ ♦ గండశైల
మొండు ప్రజలపైఁబడ జారు ♦ చుండఁగాను
కావవే సాధుపుంగవ ♦ కావుమన్న
రాయి నిలఁబడెఁ గాదె శ్రీ ♦ రామయోగి. 6
సీ. నేఁటికైన వినము ♦ నీ యూరుపేరుల
నిది యేమి చిత్రమో ♦ యెఱుఁగరాదు
నీ న్నెవరు గనిరో ♦ నీ జాతి యేదియొ
యిది యేమి చిత్రమో ♦ యెఱుఁగరాదు
ఎక్కడ నుంటివో ♦ యిట కేల వచ్చితో
యిది యేమి చిత్రమో ♦ యెఱుఁగరాదు
నీ వృత్తి యేమొకో ♦ నీచదువెంతయో
యిది యేమి చిత్రమో ♦ యెఱుఁగరాదు
తే. సకలజనులు నినుఁ దలఁచి ♦ సన్నుతింప
నేనె రామయోగి నటంటి ♦ వీవు యింక
యోగిరాముఁడ వనుటయే ♦ యోగ్యమగును
రాములో లీనమైయుంట ♦ రామయోగి. 7
సీ. అరయ నయోధ్య నీ ♦ కచ్చిరాలేదని
రప్పించితివిపోలు ♦ రాము నిటకు
భద్రాచలము నడి ♦ బాటలో లేదని
రప్పించితివిపోలు ♦ రాము నిటకు

ఉడగా మడవిమధ్య ♦ నున్న దే యంచును
రప్పించితివిపోలు ♦ రాము నిటకు
రామతీర్థమునకుఁ ♦ బ్రఖ్యాతి లేదని
రప్పించితివిపోలు ♦ రాము నిటకు
తే. కానిచో రాముఁ డిచట కీ ♦ రాక యేల
రాముఁ డిట్టుల నీయిచ్ఛ ♦ రహి మెలంగు
రాముఁడే నీవు నీవె కా ♦ రాముఁ డనఁగ
రాజితవిరాగి నువ్వుకొండ ♦ రామయోగి. 8

సీ. అరయ రాముని కయో ♦ ధ్యాపురి యగునఁట
విజనమై యొప్పు నీ ♦ విపినసీమ
భద్రాద్రి కళ్యాణ ♦ ప్రాకార మండపం
బో యీ కటికు పెద్ద ♦ బండరాయి
ఉడగామునన్ గర్భ ♦ గుడియె యీ మెట్టపై
నీవు కట్టిన రాల ♦ నికృతకుటిక
రామతీర్థంబున ♦ రమ్యమై విలసిల్లు
ఘన సీతగుండమా ♦ కారిగడ్డ
తే. ఎప్పుడగుఁ జూడఁ గొండపైఁ ♦ జెప్పుమయ్య
రామవిగ్రహము కిరీట ♦ రత్నకాంతి
ధర్మచావళ్ళు గోపురాల్ ♦ ధ్వజము రథము
రాజియా మెట్టులు బజారు ♦ రామయోగి. 9

సీ. అల విభీషణునైన ♦ యాచించి కట్టించు
కోవెల ప్రాకార ♦ గోపురములు
సూటిగా నిపు డేగి ♦ సుగ్రీవుతోఁ జెప్పి
కట్టించు మెట్టులు ♦ కరుణతోడ

ఫాలలోచను జేరి ♦ బతిమాలు వేవేగ
శ్రీరామునిఁ బ్రతిష్ఠఁ ♦ జేయు మనుచు
కర్ణునొద్దకుఁ బోయి ♦ కలహాపెటెంగించి
కట్టించు సత్రము ♦ ఘనతగాను
తే. హనుమదాదులఁ బంపు నీ ♦ వరుగకున్నఁ
జూడఁ జేదపోడుము లెంత ♦ చులుకఁదనము
చేతఁ గాకున్న వెంటనే ♦ చెప్పుమయ్యా
రామదాసుని వేఁడెద ♦ రామయోగి. 10

సీ. వైరాగివౌ నిన్ను ♦ భక్తిచే మెప్పింపఁ
దరమెట్లు నాబోఁటి ♦ దురితమతికి
గోనెగోచి గలాని ♦ గొనముచే మెప్పింపఁ
దరమెట్లు నావంటి ♦ దాంభికునకు
పాప పుణ్యము లేని ♦ పథికుని మెప్పింపఁ
దరమెట్లు నన్ బోలు ♦ దబ్బరికిని
నిరశన నిర్ణిద్ర ♦ నిర్ధార్య మెప్పింపఁ
దరమె నాసరి భోగ ♦ పరుల కెందు
తే. ననుచుఁ బద్యముల్ జెప్పితి ♦ నంతెకాదు
కనని యవతారములఁ గొల్వఁ ♦ గలుగ సుగతి
యింక నిను గొల్చు వారల ♦ కెంతఫలమొ
రాజితవిరాగి నువుకొండ ♦ రామయోగి. 11

సీ. శరణ మో తిలశైల ♦ సాధుపుంగవ నీకు
రక్షింపుమను నన్ను ♦ రాము వేగ
శరణ మో సిద్ధుఁడ ♦ శరణు ధూళివిలేప
రక్షింపుమను నన్ను ♦ రాము వేగ

శరణ మో వైరాగి ♦ శరణు లోకఖ్యాత
రక్షింపుమను నన్ను ♦ రామ వేగ
శరణు దధ్యాహారి ♦ శరణు సంయమి నీకు
రక్షింపుమను నన్ను ♦ రామ వేగ.

తే. శరణు నిరశనవ్రతదీక్ష ♦ శరణు నీకు
శరణు తిలశైలగృహ నీకు ♦ శరణు శరణు
నాదు రక్షణఁ జూడుము ♦ మోద మెనయ
రాజిత విరాగి నువుకొండ ♦ రామయోగి. 12

## 6. శతకమాహాత్మ్యము

శా. శ్రీ లొప్పారు నయోధ్యలో నగరిలో♦సీతాసఖుల్ వేడ్కతో
నాలే గర్భిణియయ్యె సీత యనుచో ♦ య్యారంబుగాఁ బల్కఁగా
చూలా లల్లనఁ జెప్పఁగా విని ప్రహృ♦ష్టుండైన రాముండు సు
శ్రీ లేపారఁగఁ జేసి భక్తులను ర ♦ క్షింపన్ శనిక్షేత్రమా.

ఆ.వె. పర్వతంబునందుఁ ♦ బ్రాయోపవేశియా
సాధురామయోగి ♦ శక్తిమెచ్చి
మోక్షమీయ వచ్చి ♦ ముదముతో నిలిచెను
రామయోగి వేడ ♦ రాగ మొప్ప. 2

ఆ.వె. రామయోగి శనులు ♦ రాగంబుతో దను
ధన్యులుగను జేయఁ ♦ దలఁచి మనలఁ
జెప్పఁగా శతకము ♦ చేసిరి నాచేత
రాముసరిని ప్రీతి ♦ రంజకముగ. 3

సీ. కాన, నో జనులార ♦ యానంద యుక్తుఁడౌ
తిలశైల రాముని ♦ గొలిచి నాదు
పాత్రంబుఁ బఱియించి ♦ పొందుఁ డారోగ్యంబు
సంతాన మాయువు ♦ సంపదలను
ధర్మవర్తనమును ♦ ధైర్యంబు బలమును
విద్య వివేకంబు ♦ వినయబుద్ధి
నిర్మలతత్వంబు ♦ నిస్సంగము నహింస
కర్మయోగంబును ♦ గార్యదీక్ష
తే. చివరకు విరాగులై యోగ ♦ సిద్ధి నొంది
నిశ్చలత్వంబు మోక్షంబు ♦ నిశ్చయముగఁ
బడయుదురు రామశనుల కృ ♦ పవలన నల
యోగసిద్ధుఁడౌ నువుకొండ ♦ యోగిమహిమ. 4

## 7. సంకల్పము

సీ. శ్రీమహేంద్రగిరిరా ♦ జి కనతి దూరంబు
న యమదిశను నుండు ♦ నువ్వకొండ
కపరదిక్కున మా య ♦ నంతగిరి మయిలు;
పదునెనిమిదియగు ♦ వందలఱువ
ది శక పుష్యముననను ♦ దిలశైలదేవ నీ
యనుకంప మండలీ కాన్వయజుఁడ
ధారుణీస్థలిని సీ ♦ తారామ యాఖ్యుండ
సత్పత్ని వెంకమ్మ ♦ సహితముగను

తే. మా దురిత విదూరస్తుతి ♦ పాదుకొల్ప
నాటవెలఁది నీకేలని ♦ తేటగీతిఁ
జేర్చి చెప్పితి సీసముల్ ♦ చిత్తగింపు
యోగగణధామ! నువుకొండ ♦ యోగిరామ!. 1

సీ. నిలువంబడుటకైన ♦ బలములేకున్నది
యెటు నిన్గొలువఁ గొండ ♦ నెక్కఁగలను?
ఒకపూఁట కాఁకలి ♦ కోర్వఁజాలనివాఁడ
నుపవాస మే రీతి ♦ నుందు నయ్య?
స్నానంబుఁ జేసిన ♦ సడలును నరములు
సంధ్యాది కృత్యముల్ ♦ సలుపఁ గలనె?
సరిగ నీ స్తుతిని ప్రశస్తముగా సల్ప
మాటాడుటకునైన వాట పడదు
తే. కాన, శతక మొకటి సమ ♦ కట్టినాఁడ
నంతియేకాని కవిత ర ♦ వంత మెఱుఁగ
నెట్లు పలికించెదో చూత మింక నన్ను
యోగగణధామ నువుకొండ యోగిరామ. 2



శ్రీరస్తు.

# శ్రీ నువ్వుకొండయోగిరామశతకము.

సుజనులారా! పరమేశ్వరభక్తులారా! ఆర్షమతాభిమానులారా! ఈ రామశతకమునందు నువ్వుకొండ శ్రీరామక్షేత్రమున కన్వయించు పద్యములకు 'నువుకొండ యోగిరామ' యనియు నితరపద్యములకు 'శ్రీరామ యోగిరామ' యనికాని 'నువుకొండ యోగిరామ' యనికాని యెవరి కిష్టమగు నటుల వారు మకుటమం దిడుకొని చదువుకొందురు గాక.

సీ. శ్రీరామ నిన్ను నే ♦ సేవింతు నావంశ
ముంచుము చంద్రార్కు ♦ లుండు వఱకు
అధ్యాత్మరామ ని ♦ న్నాశ్రయించుచు నుందు
నాయురారోగ్యము ♦ లందఁ జేయు
జానకీరామ నిన్ ♦ సంస్తుతించుచు నుందు
సౌభాగ్యముల నిచ్చి ♦ సాఁకు మయ్య
పట్టాభిరామ నిన్ ♦ బ్రార్థించుచుందును
పరమపదము లబ్బ ♦ వరము లొసఁగు
తే. తారకాహ్వయ సేతు నీ ♦ ధ్యాన మెపుడు
ధర్మసంస్థాపనాచార్య ♦ దండ మిడుదు
కర్మయోగప్రచారి నన్ ♦ గరుణఁ జూడు
యోగ గణధామ నువుకొండ ♦ యోగిరామ. 1

సీ. శ్రీరామ నినుగూర్చి ♦ చేయుచు నున్నాఁడ
నను చుఁ జేసిన కార్య ♦ మభయ మొసఁగు
శ్రీరామ నినునెంచి ♦ చేసిన కర్మముల్
సకల దుఃఖములను ♦ సమయఁ జేయు
శ్రీరామ నీసేవ ♦ జేయుదు నంచును
సంసారమును జేయ ♦ సౌఖ్య మొసఁగు
శ్రీరామ నీయున్కి ♦ చిద్రూపములఁ జూచి
సన్నుతించెడి శక్తి ♦ జయ మొసంగు
తే. నీ దరికిఁ జేర్చు నివియె సూ ♦ నిశ్చయముగ
విద్య యనఁగ నిదియెకదా ♦ విద్య యయ్యె
యితరవిద్య యవిద్యయే ♦ యెంచి చూడ
యోగ గణధామ శ్రీరామ ♦ యోగిరామ. 2

సీ. జలద నీలిమ యొప్పు ♦ చెలువు దేహము వాఁడ
ధవళ ధావళ్యనే ♦ త్రముల వాఁడ
మణిమయప్రభలీను ♦ మకుటంబు గలవాఁడ
రత్న కేయూర వి ♦ భ్రాజి వాఁడ
ఆజాను బాహువై ♦ యలరుచుండెడి వాఁడ
కమనీయ పీన వ ♦ క్షంబు వాఁడ
జ్ఞానవీర్యశ్రీ య ♦ శైశ్వర్యవైరాగ్య
ములఁ దెల్పు గాంభీర్య ♦ ముఖము వాఁడ
తే. ఏపుగా నెనిమిదడుగు ♦ లెత్తు వాఁడ
దండిఫాలంబు వాఁడ కో ♦ దండ ధరుఁడ
నిను ధ్యానింతు ననుజూడ ♦ నిర్గమించు
యోగ... ... ... ... ...రామ. 3

సీ. ఆదిత్యహృదయ ని ♦ న్నావాహనమును జేతు
నధ్యాత్మఫలదాత ♦ యాసన మిదె
పాపవిమోచక ♦ పాద్యంబు గైకొను
మాత్మస్వరూపుఁడా ♦ యర్ఘ్య మిదిగొ
ఆనందపరమాత్మ ♦ యాచమనము గొమ్ము
సేతుశయన యభి ♦ షేక మొందు
విశ్వేశ వస్త్రోప ♦ వీతమ్ములం గొను
మఖిలేశ గంధ పు ♦ ష్పాక్షత లివె
తే. దేవదేవ కేశవ ధూప ♦ దీపములను
పుణ్యదాయి నైవేద్య తాం ♦ బూలములను
మంత్రపుష్పమును గొను న ♦ మస్కరింతు
యోగ...................రామ. 4

సీ. దశకంఠుఁ బరిమార్చి ♦ దర్పంబుతో విభీ
షణు రాజుగాఁజేసి ♦ సరభసమునఁ
జెంగట వైదేహి ♦ చెంత సుగ్రీవ వి
భీషణ లక్ష్మణ ♦ వీరు లొప్ప
నంగద జాంబవ ♦ దాంజనేయ నల సు
షేణ నీలముఖులు ♦ జే యనంగఁ
బుష్పదృష్టులతోడఁ ♦ బుష్పక మెక్కి య
యోధ్యకై పోవుచు ♦ మధ్యమధ్య
తే. సీతతో ముచ్చటలు చెప్పు ♦ చెలువుకాఁడ
జానకీరామ జయరామ ♦ జనవిరామ
కనఁబడవె నాకుఁ గన్నుల ♦ కఱవు దీర
యోగ...................రామ. 5

సీ. వేయికన్నులదార ♦ వీక్షింపఁగాలేని
నీరూప మెప్పుడు ♦ నిరతిఁజూతు
వేయినోరులుగల ♦ వేలు పెన్నఁగలేని
నీచరిత్రమ్మెట్లు ♦ నిశ్చయింతు
వేయిచేతుల వేడి ♦ వేల్పు గొల్వఁగలేని
నీమూర్తి నెపుడు నే ♦ నెమ్మిఁగొలుతు
వేయికాళుల వేలు ♦ పే యెఱుంగఁగలేని
నీసృష్టియంతయు ♦ నెమకు టెపుడొ
తే. రామశతకంబునం దెప్డు ♦ నేమ మొందు
ననుచు నేనుందు నేటికి ♦ నచ్చెసందు
నన్నెపుడు కొందు నీపొందు ♦ నాకుఁ జెంద
యోగ............................రామ. 6

సీ. నీ పాదపూజను ♦ నెఱవేర్చినన్‌గాని
నిలువనేరను జుమీ ♦ నిక్కముగను
నీ హస్తములఁ బట్టు ♦ నెయ్య మచ్చినఁగాని
చేయలే నేపని ♦ చేతితోడ
నీ కంఠమాధురి ♦ నెమ్మనే వినకున్న
వినలేను శబ్దము ♦ వీనులందు
నీ సుందరాకృతి ♦ నిరతితోఁ జూడక
చూడ లే నేదియుఁ ♦ జూపుల నిఁక
తే. నీదు నామంబు పలుకక ♦ నాదు జిహ్వ
పలుకనేర దితరములఁ ♦ బంతమేమొ
తెలిసెఁగద యంగములయొక్క ♦ తెవులు నీకు
యోగ............................రామ. 7

సీ. నీవు మాయింటికి ♦ నించి యేతేరఁగఁ
గాంతునే కన్నుల ♦ కఱవు దీర
నీవు నాతోఁ జాల ♦ నెనరుతో భాషింప
విందునే యెప్పుడైన ♦ వీను లలర
నీవు చేరఁ దనువు ♦ నిగుడుచుఁ బులకింపఁ
గలుగునే యొకనాఁడు ♦ కౌఁగిలింప
నీవు నన్నిటు బద్ధు ♦ నిగఁ జేయఁ బలుమారుఁ
బాడిగాదని మ్రొక్కి ♦ పలుకు టెపుడొ
తే. యనుచుఁ జింతించుచుందు నే ♦ ననుదినంబు
నిట్టి నామీఁద జాలి యొ ♦ కింత లేక
పలుకవేల మనోవ్యథ ♦ పాలుచేసి
యోగ..................... రామ. 8

సీ. ఎందుంటివో రామ ♦ యిటకేల రావయ్య
యొకలిప్త దర్శన ♦ మొసగరాదె
నీ దర్శనము లేక ♦ నే నిటు పడియుంటి
నంతియే వ్యాధి యొ ♦ కింత లేదు
నామాట నిజమని ♦ నచ్చిచెప్పఁగ నేల
వచ్చిచూచిన నీకె ♦ నచ్చు నయ్య
యేనాఁడు దరిఁజేర్ప ♦ నెంచుచుంటివొ గాని
భరియింప లేనయ్య ♦ బంధ మింక
తే. నెపుడు నీకృప కల్గునో ♦ యెఱుఁగరాదు
దర్శనమునకె ముఱిపింప ♦ ధర్మమగునె
దీనతను మ్రొక్కి యేడ్చినఁ ♦ దేర వలదె
యోగ..................... రామ. 9

సీ. బంగారుతో రత్న ♦ శృంగారమై యొప్పు
కోటయే మా పూరి ♦ కొంప నీకు
రత్నరాజిత సువ ♦ర్ణ ప్రభలీను నెమలి
సింహాసనమె పీట ♦ చెక్క నీకు
కస్తూరి ఘనసార ♦ గంధమే యిచ టబ్బు
చందనాద్యత్యుతా ♦ర్చనలు నీకు
షడ్రసోపేత మృ ♦ష్టాన్నమే మాబోంట్ల
యాహార నైవేద్య ♦ మారగింపు
తే. ఏల వచ్చెదవయ్య మా ♦ యింటి కీవు
పేదవారలఁ జూతురె ♦ పెద్దవారు
మానవుల సాటి యైతివే ♦ మాన్యచరిత
యోగ..................రామ. 10

సీ. జగడాలముచ్చైన ♦ జడదారితో ముచ్చ
టించుచుఁ జూడరా ♦ వేమొ నన్ను
తెలుచుగా జంగము ♦ తామసి చెల్మిని
నా సంకటముఁ బాపు ♦ నాస గలదె
తండ్రినిఁ జంపించు ♦ తనయుని స్తుతివించు
వినవేమొ నానింద ♦ వినుతి నేడు
రాజుసొమ్ము హరించు ♦ రామదాసునిఁ గాంచి
పాపపు నా లేమి ♦ భావ్యమగునె
తే. నీకె తగినట్టి వారితో ♦ నేస్తమాట
చూడకున్నను ననునింక, ♦ చోద్యమలరఁ
గీర్తి నిండగ వర్ణింతు ♦ గెలిసేతు
యోగ..................రామ. 11

సీ. శివునకు నీకును ♦ జెప్ప భేదములేదు
కలదంద్రు కొందఱు ♦ దెలియ కింత
ఒకఁడు పందిని గొట్ట ♦ నొకఁడు గోఁతినిఁ గొట్టు
నిద్దఱు వ్యాధులై ♦ యెంచి చూడ
నయ్యొ రూపొకటియె ♦ వెయ్యాఱు రూపులై
గడె కొక వేషమై ♦ కానవచ్చు
రజితాద్రి నొకఁడు బై ♦ రాగి నను చు నుండ
నకట తమ్మునిరాజ్య ♦ మొకఁడు గొనియె
తే. నాకుఁ జెప్పెద వయ్య ♦ మీ పోక లింక
నెఱుఁగనే మీ యసదృశ దు ♦ శ్చరిత మింక
నతఁడు నీ కబ్బ యాతని ♦ కబ్బవీవు
యోగ........................రామ. 12

సీ. ఒకతమ్మునకును బా ♦ దుక లిచ్చి చేసితి
బైరాగి కోదండ ♦ పాణి వీవు
వేఱొక తమ్ము నా ♦ హార నిద్రలు మాన్పి
చాకిరిగను జేయు ♦ సాత్వికుఁడవు
అన్నను గుహనుంచి ♦ యతని భార్యాహరించు
తమ్ముని పక్షంబుఁ ♦ దాల్చితేల
యన్నకుఁ బ్రతిపక్షుఁ డౌ ♦ తమ్మునిం గాంచి
చేసితి రాజుగా ♦ సీత కొఱకు
తే. నెవ రెఱుఁగరు నీ మాయల ♦ వివర మెల్ల
ననుజుల తగవులను నిన్నె ♦ యడుగవలయు
లోకుల కిటులఁ జెప్పిన ♦ లోచ్చు గాదె
యోగ........................రామ. 13

సీ. సుందోపసుందులన్ ♦ సోదరుల జగడ
మాడించి చెఱపిన ♦ వాఁడ వీవె
సోదరులా సురా ♦ సురులను దగిలించి
యొకరి పక్షము చేరి ♦ యుబ్బు టేమి
అన్నను బ్రేమించు ♦ ననుజు మనము ద్రిప్ప
తమ్ముని గృహమందుఁ ♦ దగునె కుదువ
దాయ భాగము లేని ♦ ధర్మజుఁ బురికొల్పి
జ్ఞాతిని జంపించు ♦ నంగనాచి
తే. ఇట్టు పాలికాఁపన నీకుఁ ♦ గిట్టదయ్య
ఇంత యొంటి గొట్టుందన ♦ మేల నీకు
నిట్టిఁడవు నాది ను్యా ♦ సృష్టి యెల్ల ననవె
యోగ....................రామ. 14

సీ. మొసలినిఁ గొట్టుట ♦ ముఖ్యమా శ్రీలోల
గజము మీవారికిఁ ♦ గావలె నఁటె
తాటక మర్దింపఁ ♦ దగుఁగాదె విశ్వేశ
యజ్వ విశ్వామిత్రుఁ ♦ డగుట నీకు
వాలిని జంపితి ♦ వా యినకులచంద్ర
సుగ్రీవుఁ డినజుఁడు ♦ సుమ్మనుచును
గర్ణుని నీల్గింపఁ ♦ గాఁ గారణ ముపేంద్ర
యర్జునుఁ డింద్రజుఁ ♦ డగుటఁ గాదె
తే. యెన్ని చూచిన నిజలాభ ♦ మే కనఁబడు
నంతియే కాని వేఱొక ♦ టింత లేదు
యాత్ర శనివారమగు జ్ఞాతి యాటనుశని
యోగ..................రామ, 15

సీ. పూర్వదేవతలను ♦ బోకార్చితి గదయ్య
త్రిదశులలోఁ జేరి ♦ మొదట నీవు
ధర్మవర్తనుఁ డగు ♦ దాతను దిగఁద్రొక్కి
కులగోత్ర భిదునకుఁ ♦ గూర్చితి సిరి
కులగురు వైరిని ♦ గురువుగాఁ జేసితి
మారణ మంత్రముల్ ♦ కోరి కాదె
దండకాటవిలోనఁ ♦ దల దాఁచుకొన్నట్టి
పుణ్యజనుల నేల ♦ పొరిఁగొనంగ
తే. నిట్టిపనులను జేసిన ♦ దిట్ట కింక
బలె జగద్రక్షక బిరుదు ♦ గలిగెనొక్కొ
మంచికీర్తి గలాఁడవె ♦ యెంచి చూడ
యోగ......................రామ 16

సీ. వచ్చి పోయెడు వారు ♦ వలదని వని డాఁగు
మౌను లన్నను నీకు ♦ మనసు మిగుల
జీవహింసకు లయ్యు ♦ జీవనంబును జేయు
శబరులె నీకెంతో ♦ జాలు వారు
చెట్లనెక్కి వికార ♦ చేష్టలు చేసెడి
కోఁతులె నీకెంతో ♦ కూర్చు వారు
స్వామి ద్రోహముఁ జేసి ♦ సాధు వాక్యము లాడు
రాక్షసు లన నను ♦ రాగ మయ్య
తే. సంఘమున నుండి సంసార ♦ సంగతిఁ గని
కాయకసరులఁ దినుచు సం ♦ కల్పులైన
వార మగుదుమె నీ సహ ♦ వాసమునకు
యోగ........................రామ 17

సీ. లక్ష్మణుఁ డీనింద ♦ లక్ష్యంబు జేయఁడా
రక్షింపఁ బోదము ♦ రమ్మనుటకు
సీతకైనను జెప్పఁ ♦ జేతఁగా కుండెనా
ప్రోవ కున్నఁ బరువు ♦ పోవు ననుచు
గురువు వసిష్ఠున ♦ కు మొగమోటమె చెప్పఁ
గాపాడుటకు వేగ ♦ కదలు మనుచు
హనుమంతునకు నైన ♦ మనసుపుట్టదు కదా
శీఘ్రంబుగాఁ దెచ్చి ♦ చెంత నిలుప
తే. కాని యేమొకొ మీ కింత ♦ గర్వమైన
నేనె పోవుద మనుటకు ♦ నిలువ లేనె
యెన్నినా ళ్లింక నను నిట్లు ♦ నింట నుంతు
యోగ.........................రామ. 18

సీ. ప్రారబ్ధ మనుభవిం ♦ పక తప్ప దనకుండ
రక్షింపవే న న్ను ♦ పేక్ష దగదు
కామ్యకర్మము దప్పఁ ♦ గారణ మరయక
రక్షింపవే న న్ను ♦ పేక్ష దగదు
ఈజన్మసంచిత ♦ మింత కలదనక
రక్షింపవే న న్ను ♦ పేక్ష దగదు
గత నిజో త్తరజన్మ ♦ కారణంబు క్షమించి
రక్షింపవే న న్ను ♦ పేక్ష దగదు
తే. నీవు రక్షింప కున్నను ♦ నెగ్గఁ గలనె
దిక్కు వేరిఁక మఱిలేదు ♦ దీన బంధు
త్వరగ రక్షింపుమీ నన్నుఁ ♦ గురుణతోడ
యోగ.........................రామ. 19

సీ. నాజాతకము రీత్య ♦ నాలిగ్రహము శని
బాధఁ జేయక యుండ ♦ బోధఁ జేయు
నాభక్తు నిట్టుల ♦ నావాఁడవై నీవు
లేవ కుండగఁ జేయ ♦ లెస్స యనుము
ధర్మరాజవు నీవు ♦ ధర్మంబు నెఱుఁగవే
నాభక్తుని మనుప ♦ న్యాయ మనుము
ప్రార్థింతు శని నమో ♦ రౌద్రరూపా యని
కావు మనుము నన్నుఁ ♦ గరుణ గలిగి
తే. ఇనకులతిలక శనిగ్రహ ♦ మినజుఁడగుట
నతని వాసంబునను నీవు ♦ నవతరింప
నీదు మాటను మన్నించు ♦ నిశ్చయముగ
యోగ........................రామ. 20

సీ. నేను నీ శతకంబు ♦ నిష్ఠతో వ్రాసితి
రాహు శని రవిలో ♦ రంజితముగ
నీపూర్వుఁడగు శని ♦ నీశతకముఁ దండ్రి
విదశలోఁ జెప్పించె ♦ వినయముగను
రవికులదీప యా ♦ రాగంబు గనుగొన్న
మన్నించు ని న్నను ♦ మాన మేల
తనదు క్షేత్రమునకై ♦ తాపత్రయము నొందు
నన్నుఁ గాపాడఁడె ♦ న్యాయమెఱిఁగి
తే. యెన్ని చిక్కులు పెట్టిన ♦ నెన్న నేను
నీదుశతకంబు జెప్పించు ♦ నియతి చాలు
నిందఁ జేయక శని నుతి ♦ నిండఁజేతు
యోగ........................రామ. 21

సీ. లెండయ్య జనులార ♦ రండు పోవుద మింక
నువ్వుకొండకు నేఁడు ♦ దవ్వుకాదు
సేవింప రారఁటే ♦ శీఘ్రంబుగా మీరు
తిలశైల రామునిఁ ♦ దెలియ లేదె
భద్రాచల మయోధ్య ♦ వఱకును బోనేల
యనవసర వ్యయం ♦ బగును దాస
పూండి పళాసల ♦ కుండు నాలుగె మైళ్ళు
రోడ్డుప్రకట-నె యుండు ♦ రూఢిగాను
తే. గోర్కెలీడేరు వేగమె ♦ కొలుచు కొన్న
భక్తి భజియింప నెంతయో ♦ ఫలము గలుగు
ననుచుఁ బిలుచు కొందురు మిము ♦ జనులు దలఁచి
యోగ......................రామ. 22

సీ. ముసలమానుల శూన్య ♦ మోక్షమందిర మఁటె
విగ్రహాశూన్యమై ♦ వెలయుటకును
క్రైస్తవ ఫాదరు ♦ వ్యస్తమందిరమె ని
దర్శన శూన్యమై ♦ తనరుటకును
బౌద్ధ సన్యాసుల ♦ బోద్ధ విహారమె
ప్రతిమా రహితమయి ♦ ప్రబలుటకును
ఆర్యమతస్థుల ♦ యాచార మౌనఁటె
మూర్తి లేకుండనే ♦ మురియుటకును
తే. బిందు వవ్యాప్యమై వ్యాప్తి ♦ నొందు గణిత
మం దటు లరూప మెటులగు ♦ నభ్యసింప
అందుకొఱకె కాదె యవతా ♦ రార్చనములు
యోగ...............రామ. (టిప్పణి చూడుడు) 23

సీ. అనిశంబు మీసేవ ♦ నాచరించుచునుండు
శత్రుసంహర్త సౌ ♦ మిత్రితోడ
నతులిత భక్తిచే ♦ నాదరంబునఁ జూచి
చింత లన్నియుఁ దీర్చు ♦ సీత తోడ
సరభసమును నతి ♦ సాహసమును జూపి
నిష్ఠ గొల్చెడు నాంజ ♦ నేయు తోడఁ
గూటస్థుఁడౌ రవి ♦ కొంతసే పిక్కడ
నుదయమున విడిసి ♦ యుండు ననుచు
తే. జ్ఞాతి యౌ శని వి శ్రాంతి ♦ శాల యనుచు
నిచట శాశ్వతముగ నుండ ♦ నిచ్ఛగించి
వచ్చితివి పోలు మిముఁ జూడ ♦ వచ్చునెపుడు
యోగ......................రామ 24

సీ. అంగ కళింగ గోత్క ♦ ళాంధ్ర కర్ణాటక
రాష్ట్రీయులకును శ్రీ ♦ రాము నాజ్ఞ
కోసల పాంచాల ♦ ఘూర్జరారవ సింధు
రాష్ట్రీయులకును శ్రీ ♦ రాము నాజ్ఞ
సౌరాష్ట్ర బంగాళ ♦ సౌవీర నేపాళ
రాష్ట్రీయులకును శ్రీ ♦ రాము నాజ్ఞ
మాళ్వ మరాట్కూర్గు ♦ మైసూరు నైజాము
రాష్ట్రీయులకును శ్రీ ♦ రాము నాజ్ఞ
తే. తెలిసి తప్పక రాఁదగు ♦ తిలనగంబు
తమ నవమి మహోత్సవ దర్శ ♦ నమున కని ప
వనుజు లేఖతో లక్ష్మణు ♦ బంపు మనుము
యోగ......................రామ. 25

సీ. సృష్టియె పరమాత్మ ♦ చింతింప నని కొల్వ
సాయుజ్య మొసఁగవే ♦ సరభసమున
విష్ణువె పరమాత్మ ♦ వినఁగ నంచని కొల్వ
సారూప్య మొసఁగవే ♦ సరభసమున
నా మరుత్వంతుఁడె ♦ యగు బ్రహ్మమని కొల్వ
సాలోక్య మొఁసగవే ♦ సరభసమున
నెన్ని విధములనో ♦ యెందఱొ యెన్నిరూ
పుల నినుఁ గొల్వ వి ♦ ముక్తి లేదె
తే. యత్ర యత్ర మనోయాతి ♦ తత్ర తత్ర
పరమ పదమని పరమాత్మ ♦ పరఁగు ననుచు
వాకొనఁగ ఋషు లీమత ♦ వాద మేల
యోగ.....................రామ. 26

సీ. మతమేదియైనను ♦ మనసు బెట్టఁగ నేల
యందఱు గొల్చెడి ♦ యయ్య యొకఁడె
సంఘధర్మములను ♦ జక్కఁగా నెఱవేర్చి
నిజ మతాచారముల్ ♦ నిష్ఠ సలుపు
హిందువు లీశ్వరు ♦ లెందఱో యందు ర
నరుఁ డిందువులు దేవుఁ ♦ డొకఁడె యందు
దృగ్గోచరముఁగాని ♦ సృష్టిగా వేల్పుల
సృష్టించె నందురు ♦ చిత్రముగు నె
తే. యేది యెట్టులైనను దాని ♦ కేమి లెండు
స్వల్ప విషయముల కొఱకు ♦ స్వమత బోధఁ
జేసి బంధుజనుల విభ ♦ జింపఁ దగు నె
యోగ.....................రామ. 27

సీ. మతకలహమ్ములన్ ♦ మట్టిపెట్టని వాఁడు
నన్యమతోత్సవ ♦ మ్మడ్డు వాఁడు
విషయ లోలుండయి ♦ వెడఁగు నయ్యెడి వాఁడు
దేశ భక్తియులేక ♦ తిరుగు వాఁడు
తనజాతి కపకార ♦ మొనఁగూర్చు వాఁడును
విశ్వాస రహితుఁడై ♦ పీగు వాఁడు
నీ బిడ్డఁడా నన్య ♦ నిం జక్కడఁచు వాఁడు
నితరుల మనము నొ ♦ ప్పించు వాఁడు
తే. మంకు తనమున ద్రోహియై ♦ మనెడి వాఁడు
నన్యులకు హానియగా బొంకు ♦ లాడు వాఁడు
చెడును నీ యాగ్రహముచేత ♦ చెనటి యగుచు
యోగ............................రామ 28

సీ. ముదిమి మృత్యువు గూర్చి ♦ మదినెంచ కెన్నఁడు
ధనము విద్యయుఁ గూర్ప ♦ దలఁచు వాఁడె
మృత్యువు నన్నుఁబట్టి ♦ మెక్కనున్న దఁటంచు
ధర్మవర్తనమందఁ ♦ దలఁచు వాఁడె
అన్యమతాలయం ♦ బని యెంచ కటు పోవ
నదియు నీదని మ్రొక్క ♦ యరుగు వాఁడె
అన్యమతోత్సవ ♦ మం దుత్సహించుచు
నదియు నీయుత్సవ ♦ మనెడు వాఁడె
తే. జనుల యెడ సోదరత్వంబు ♦ జరుపు వాఁడె
పర ధనాంగనలకు నాస ♦ పడని వాఁడె
జీవయాత్ర నీ కృపచేతఁ ♦ జేయు లెస్స
యోగ............................రామ 29

సీ. ద్రావిడుల్ చెట్లనే ♦ దైవంబు లన నది
తులసిపూజగ నిందు ♦ నిలుపఁ బడియె
కాళింగులు ఫణుల ♦ ఘనముగాఁ బూజింప
నవి హరి హారులకు ♦ నతుకఁ బడియె
పూర్వులు బహుదైవ ♦ ములఁ గొల్వఁగా నది
యంగీకరించిరి ♦ యార్యు లపుడె
దేవుఁ డొకఁ డన న ♦ దియె నిజ మ్మనుచును
దేవదేవుఁ డొకఁడె ♦ తెలియుఁ డనిరి
తే. బుద్ధముని త్యాగమే ముక్తి ♦ సిద్ధి యనిరి
జిను తపోమార్గమే ముక్తి ♦ జేర్చు ననిరి
సర్వసమ్మతమె ఋషుల ♦ సన్మతంబు
యోగ..................రామ. 30

సీ. ఒరు లేవి చేసిన ♦ నోర్వఁడు తా నవి
యొరులకు నవి చేయ ♦ కుండు నెవఁడు
నీభక్తు లెదురైన ♦ నెక్కొను భక్తి చే
సేవకుఁడయి సేవ ♦ సేయు నెవఁడు
జీవు లడ్డంబైనఁ ♦ జేరి యకారణ
హింసఁ జేయ కెవఁడు ♦ హితము సేయు
నసహాయులను గాంచి ♦ యాసక్తి చేతను
జేతనా సాయము ♦ చేయు నెవఁడు
తే. చెలిమి నన్యమతస్థులఁ ♦ జేరు నెవఁడు
విషయలోలుఁడు కాకుండ ♦ వెలయు నెవఁడు
మిత్రులుగఁ శత్రు లార్వుర ♦ మెలపు నెవఁడు
వాఁడె నీయనుగ్రహమున ♦ వఱలుఁ గాదె! యోగ...రామ

సీ. పూర్వదేవతలను ♦ బోకార్చితి గదయ్య
త్రిదశులలోఁ జేరి ♦ మొదట నీవు
ధర్మవర్తనుఁ డగు ♦ దాతను దిగఁద్రొక్కి
కులగోత్ర భిదునకుఁ ♦ గూర్చితి సిరి
కులగురు వైరిని ♦ గురువుగాఁ జేసితి
మారణ మంత్రముల్ ♦ కోరి కాదెఁ
దండకాటవిలోనఁ ♦ దల దాఁచుకొన్నట్టి
పుణ్యజనుల నేల ♦ పోరిఁగొనంగ
తే. నిట్టిపనులను జేసిన ♦ దిట్ట కింక
బలె జగద్రక్షక బిరుదు ♦ గలిగెనొక్కొ
మంచికీర్తి గలాఁడవె ♦ యెంచి చూడ
యోగ........................రామ 16

సీ. వచ్చి పోయెడు వారు ♦ వలదని వని డాఁగు
మాను లన్నను నీకు ♦ మనసు మిగుల
జీవహింసకు లయ్యు ♦ జీవనంబును జేయు
శబరులె నీకెంతో ♦ జాలు వారు
చెట్లనెక్కి వికార ♦ చేష్టలు చేసెడి
కోఁతులె నీకెంతో ♦ కూర్చు వారు
స్వామి ద్రోహముఁ జేసి ♦ సాధు వాక్యము లాడు
రాక్షసు లన నను ♦ రాగ మయ్య
తే. సంఘమున నుండి సంసార ♦ సంగతిఁ గని
కాయకసరులఁ దినుచు సం ♦ కల్పులైన
వార మగుదుమె నీ సహ ♦ వాసమునకు
యోగ........................రామ 17

సీ. లక్ష్మణుఁ డీనింద ♦ లక్ష్యంబు జేయఁడా
రక్షింపఁ బోదము ♦ రమ్మనుటకు
సీతకైనను జెప్పఁ ♦ జేతఁగా కుండెనా
ప్రోవ కున్నఁ బరువు ♦ పోవు ననుచు
గురువు వసిష్ఠున ♦ కు మొగమోటమె చెప్పఁ
గాపాడుటకు వేగ ♦ కదలు మనుచు
హనుమంతునకు నైన ♦ మనసుపుట్టదు కదా
శీఘ్రంబుగాఁ దెచ్చి ♦ చెంత నిలుప
తే. కాని యేమొకో మీ కింత ♦ గర్వమైన
నేనె పోవుద మనుటకు ♦ నిలువ లేనె
యెన్ని నాళ్లింక నను నీట్లు ♦ నింట నుంతు
యోగ........................రామ. 18

సీ. ప్రారబ్ధ మనుభవిం ♦ పక తప్ప దనకుండ
రక్షింపవే నన్ను ♦ పేక్ష దగదు
కామ్యకర్మము దప్పఁ ♦ గారణ మరయక
రక్షింపవే నన్ను ♦ పేక్ష దగదు
ఈజన్మసంచిత ♦ మింత కలదనక
రక్షింపవే నన్ను ♦ పేక్ష దగదు
గత నిజోత్తరజన్మ ♦ కారణంబు క్షమించి
రక్షింపవే నన్ను ♦ పేక్ష దగదు
తే. నీవు రక్షింప కున్నను ♦ నెగ్గఁ గలనె
దిక్కు వేరింక మఱిలేదు ♦ దీన బంధు
త్వరగ రక్షింపుమీ నన్నుఁ ♦ గురుణతోడ
యోగ........................రామ. 19

సీ. నాజాతకము రీత్యా ♦ నాలిగ్రహము శని
బాధఁ జేయక యుండ ♦ బోధఁ జేయు
నాభక్తు నిట్టుల ♦ నావాఁడవై నీవు
లేవ కుండగఁ జేయ ♦ లెస్స యనుము
ధర్మరాజవు నీవు ♦ ధర్మంబు నెఱుఁగవే
నాభక్తుని మనుప ♦ న్యాయ మనుము
ప్రార్థింతు శని నమో ♦ రౌద్రరూపా యని
కావు మనుము నన్నుఁ ♦ గరుణ గలిగి
తే. ఇనకులతిలక శనిగ్రహ ♦ మినజుఁడగుట
నతని వాసంబునను నీవు ♦ నవతరింప
నీదు మాటను మన్నించు ♦ నిశ్చయముగ
యోగ..................రామ. 20

సీ. నేను నీ శతకంబు ♦ నిష్ఠతో వ్రాసితి
రాహు శని రవిలో ♦ రంజితముగ
నీపూర్వుఁడగు శని ♦ నీశతకముఁ దండ్రి
విదశలోఁ జెప్పించె ♦ వినయముగను
రవికులదీప యా ♦ రాగంబు గనుగొన్న
మన్నించు ని న్నను ♦ మాన మేల
తనదు క్షేత్రమునకై ♦ తాపత్రయము నొందు
నన్నుఁ గాపాడఁడె ♦ న్యాయమెఱిఁగి
తే. యెన్ని చిక్కులు పెట్టిన ♦ నెన్న నేను
నీదుశతకంబు జెప్పించు ♦ నియతి చాలు
నిందఁ జేయక శని నుతి ♦ నిండఁజేతు
యోగ..................రామ. 21

సీ. లెండయ్య జనులార ♦ రండు పోవుద మింక
నువ్వుకొండకు నేడు ♦ దవ్వుకాదు
సేవింప రారేటే ♦ శీఘ్రంబుగా మీరు
తిలశైల రాముని ♦ దెలియ లేదె
భద్రాచల మయోధ్య ♦ వఱకును బోనేల
యనవసర వ్యయం ♦ బగును దాస
పూండి పళాసల ♦ కుండు నాలుగె మైళ్ళు
రోడ్డుప్రక్క నె యుండు ♦ రూఢిగాను
తే. గోర్కెలీడేరు వేగమె ♦ కొలుచు కొన్న
భక్తి భజియింప నెంతయో ♦ ఫలము గలుగు
ననుచు బిలుచు కొందురు మిము ♦ జనులు దలచి
యోగ........................రామ. 22

సీ. ముసలమానుల శూన్య ♦ మోక్షమందిర మటె
విగ్రహశూన్యమై ♦ వెలయుటకును
క్రైస్తవ ఫాదరు ♦ వ్యస్తమందిరమె ని
దర్శన శూన్యమై ♦ తనరుటకును
బౌద్ధ సన్యాసుల ♦ బౌద్ధ విహారమె
ప్రతిమా రహితమయి ♦ ప్రబలుటకును
ఆర్యమతస్థుల ♦ యాచార మానటె
మూర్తి లేకుండనే ♦ మురియుటకును
తే. బిందు వవ్యాప్యమై వ్యాప్తి ♦ నొందు గణిత
మం దటు లరూప మెటులగు ♦ నభ్యసింప
అందుకొఱకేకాదె యవతా ♦ రార్చనములు
యోగ................రామ. (టిప్పణి చూడుడు) 23

సీ. అనిశంబు మీసేవ ♦ నాచరించుచునుండు
శత్రుసంహర్త సౌ ♦ మిత్రితోడ
నతులిత భక్తిచే ♦ నాదరంబునఁ జూచి
చింత లన్నియుఁ దీర్చు ♦ సీత తోడ
సరభసమును నతి ♦ సాహసమును జూపి
నిష్ఠ గొల్చెడు నాంజ ♦ నేయు తోడఁ
గూటస్థుఁడౌ రవి ♦ కొంతసే పిక్కడ
నుదయమున విడిసి ♦ యుండు ననుచు
తే. జ్ఞాతి యాశని వి శ్రాంతి ♦ శాల యనుచు
నిచట శాశ్వతముగ నుండ ♦ నిచ్ఛగించి
వచ్చితివి పోలు మిముఁ జూడ ♦ వచ్చునెపుడు
యోగ....................రామ 24

సీ. అంగ కళింగ గోత్క ♦ ళాంధ్ర కర్ణాటక
రాష్ట్రీయులకును శ్రీ ♦ రాము నాజ్ఞ
కోసల పాంచాల ♦ ఘూర్జరారవ సింధు
రాష్ట్రీయులకును శ్రీ ♦ రాము నాజ్ఞ
సౌరాష్ట్ర బంగాళ ♦ సౌవీర నేపాళ
రాష్ట్రీయులకును శ్రీ ♦ రాము నాజ్ఞ
మాళ్వ మరాటుక్కూర్గు ♦ మైసూరు నైజాము
రాష్ట్రీయులకును శ్రీ ♦ రాము నాజ్ఞ
తే. తెలిసి తప్పక రాఁదగు ♦ తిలనగంబు
తమ నవమి మహోత్సవ దర్శ ♦ నమున కని ప
వనుజు లేఖతో లక్ష్మణు ♦ బంపు మనుము
యోగ....................రామ. 2

సీ. సృష్టియె పరమాత్మ ♦ చింతింప నని కొల్వ
సాయుజ్య మొసఁగవే ♦ సరభసమున
విష్ణువె పరమాత్మ ♦ వినఁగ నంచని కొల్వ
సారూప్య మొసఁగవే ♦ సరభసమున
నా మరుత్వంతుఁడె ♦ యగు బ్రహ్మమని కొల్వ
సాలోక్య మొసఁగవే ♦ సరభసమున
నెన్ని విధములనో ♦ యెందఱో యెన్నిరూ
పుల నినుఁ గొల్వ వి ♦ ముక్తి లేదె
తే. యత్ర యత్ర మనోయాతి ♦ తత్ర తత్ర
పరమ పదమని పరమాత్మ ♦ పరఁగు ననుచు
వాకొనఁగ ఋషు లీమత ♦ వాద మేల
యోగ.......................రామ. 26

సీ. మతమేదియైనను ♦ మనసు బెట్టఁగ నేల
యందఱు గొల్చెడి ♦ యయ్య యొకఁడె
సంఘధర్మములను ♦ జక్కఁగా నెఱవేర్చి
నిజ మతాచారముల్ ♦ నిష్ఠ సలుపు
హిందువు లీశ్వరు ♦ లెందఱో యందు ర
నఁతుఁ డిందువులు దేవుఁ ♦ డొకఁడె యందు)
దృగ్గోచరముఁగాని ♦ సృష్టిగా వేల్పుల
సృష్టించె నందురు ♦ చిత్రమగునె
తే. యేది యెట్టులైనను దాని ♦ కేమి లెండు
స్వల్ప విషయముల కొఱకు ♦ స్వమత బోధఁ
జేసి బంధుజనుల విభ ♦ జింపఁ దగునె
యోగ.......................రామ. 27

సీ. మతకలహమ్ములన్ ♦ మట్టిపెట్టని వాఁడు
నన్యమతోత్సవ ♦ మ్మడ్డు వాఁడు
విషయ లోలుండయి ♦ వెడఁగు నయ్యెడి వాఁడు
దేశ భక్తియులేక ♦ తిరుగు వాఁడు
తనజాతి కపకార ♦ మొనఁగూర్చు వాఁడును
విశ్వాస రహితుఁడై ♦ పీగు వాఁడు
నీ బిడ్డఁడా నన్యు ♦ నిం జక్కఁడఁచు వాఁడు
నితరుల మనము నొ ♦ ప్పించు వాఁడు
తే. మంతు తనమున ద్రోహియై ♦ మనెడి వాఁడు
నన్యులకు హానియగా బొంతు ♦ లాడు వాఁడు
చెడును నీ యాగ్రహముచేత ♦ చెనటి యగుచు
యోగ........................రామ 28

సీ. ముదిమి మృత్యువు గూర్చి ♦ మదినెంచ కెన్నఁడు
ధనము విద్యయుఁ గూర్ప ♦ దలఁచు వాఁడె
మృత్యువు నను్ఁబట్టి ♦ మెక్కనున్న దఁటంచు
ధర్మవర్తనమునందుఁ ♦ దలఁచు వాఁడె
అన్యమతాలయం ♦ బని యెంచ కటు పోవ
నదియు నీదని మ్రొక్కి ♦ యరుగు వాఁడె
అన్యమతోత్సవ ♦ మందుత్సహించుచు
నదియు నీయుత్సవ ♦ మనెడు వాఁడె
తే. జనుల యెడ సోదరత్వంబు ♦ జరుపు వాఁడె
పర ధనాంగనలకు నాస ♦ పడని వాఁడె
జీవయాత్ర నీ కృపచేతఁ ♦ జేయు లెస్స
యోగ........................రామ 29

సీ. ద్రావిడుల్ చెట్లనే ♦ దైవంబు లన నది
తులసిపూజగ నిందు ♦ నిలుపఁ బడియె
కాళింగులు ఫణుల ♦ ఘనముగాఁ బూజింప
నవి హరి హరులకు ♦ నతుకఁ బడియె
పూర్వులు బహుదైవ ♦ ములఁ గొల్వఁగా నది
యంగీకరించిరి ♦ యార్యు లపుడె
దేవుఁ డొకఁ డన న ♦ దియె నిజ మ్మనుచును
దేవదేవుఁ డొకఁడె ♦ తెలియుఁ డనిరి
తే. బుద్ధముని త్యాగమే ముక్తి ♦ సిద్ధి యనిరి
జిను తపోమార్గమే ముక్తి ♦ జేర్చు ననిరి
సర్వసమ్మతమె ఋషుల ♦ సన్మతంబు
యోగ..................రామ. 30

సీ. ఒరులేవి చేసిన ♦ నోర్వఁడు తా నవి
యొరులకు నవిచేయ ♦ కుండు నెవఁడు
నీభక్తు లెదురైన ♦ నెక్కొను భక్తిచే
సేవకుఁడయి సేవ ♦ సేయు నెవఁడు
జీవు లడ్డంబైనఁ ♦ జేరి యకారణ
హింసఁ జేయ కెవఁడు ♦ హితము సేయు
నసహాయులను గాంచి ♦ యాసక్తిచేతను
జేతనౌ సాయము ♦ చేయు నెవఁడు
తే. చెలిమి నన్యమతస్థులఁ ♦ జేరు నెవఁడు
విషయలోలుఁడు కాకుండ ♦ వెలయు నెవఁడు
మిత్రులుగఁ శత్రు లార్వుర ♦ మెలపు నెవఁడు
వాఁడె నీయనుగ్రహమున ♦ వఱలుఁ గాదె। యోగ...రామ

సీ. సంతతంబును రామ ♦ సంకీర్తనంబును
　　　　సలుపుచుఁ గాలంబు ♦ జరుపు వాఁడు
　సర్వకార్యములందు ♦ సర్వేశు గుఱిచేసి
　　　　కాలయాపనఁ జేయఁ ♦ గలుగు వాఁడు
　అబ్బిన యపుడెల్ల ♦ హరికథా శ్రవణంబు
　　　　వీనుల కింపుగా ♦ వినెడి వాఁడు
　తఱుచుగా నిష్ఠతోఁ ♦ దారకమంత్రంబు
　　　　జపమొనర్చుచు నుండఁ ♦ జాలు వాఁడు
తే. దివ్యతీర్థములకు సదా ♦ తిరుగు వాఁడు
　నన్నిటను రాముఁ డుండు నం ♦ చరయు వాఁడు
　నీదయవలనఁ దప్పక ♦ నెగ్గుఁ గాదె
　యోగ..................రామ.　　32

సీ. సౌందర్యవతియైన ♦ జారకామినిఁ జూడ
　　　　జారుఁడు పడు తమి ♦ తీరుగాగ
　ధనరాశికై దొంగ ♦ తమకించు చందాన
　　　　నాఁకలి కాహార ♦ మబ్బినటుల
　మధురపదార్థ సం ♦ భారంబు గలచోటఁ
　　　　జేరు నిర్భయమైన ♦ చీమ పగిది
　జలములో మునిఁగిన ♦ జనుఁడు వాయువుగూర్చి
　　　　వేదనఁ బడుచుండు ♦ విధముగాను
తే. బాధ నిద్రా భయాహార ♦ వర్జితుఁడయి
　నిరతితో భక్తిచేసిన ♦ నేర్పుకాఁడె
　ధన్యుఁడౌఁగాని యన్యుల ♦ తరమటయ్య
　యోగ.....................రామ.　　33

సీ. నఱుకవచ్చెడు జను ♦ నకు నీడ నిచ్చెడు
మహిజమ్ములను జూచి ♦ మనుట యొప్పు
నజ్ఞానమును ద్రోలి ♦ సుజ్ఞానివై యుండ
దీపంబునను జూచి ♦ తెలియ వలయు
నాత్మయోగమున న ♦ త్యంత శుభ్రత నిచ్చు
నీరంబువలె నుండ ♦ నేర్వ వలయు
విషయాహి విషయ దు ♦ ర్విష విపన్నుఁడుగాక
పాములవాఁడునాఁ ♦ బరగ వలయు
తే. మేఘములతోడ నాదిత్యు ♦ మేళనముగ
నాత్మ కే వికారము నంట ♦ దనుకొనవలె
బోధకులు లేరె యిటులను ♦ బుద్ధి నరయ
యోగ.............................రామ. 34

సీ. బౌద్ధసన్యాసులు ♦ వైరాగ్యము వహించి
నిర్వాణులౌ విధి ♦ నేను దలఁతు
ముస్లీములు నమాజు ♦ మ్రొక్కుల మెప్పింప
ముదితుఁడౌ నల్లాకు ♦ మ్రొక్కు చుందు
క్రైస్తవుల్ చర్చిలోఁ ♦ గ్రమముగాఁ బ్రార్థింప
విశ్రాంతి నిడునయ్య ♦ వినుతిఁ జేతు
నాస్ట్రేలియామెరి ♦ కాఫ్రికనులు గొల్చి
నిర్మలులౌ దేవ ♦ నిన్నుఁ గొలుతు
తే. మత మనఁగ నెట్టులో నిను ♦ మదిఁ దలఁచుట
విధులు నాచారములు నెన్నొ ♦ విధము లన్ని
చేర్చు నిను జలము జలధిఁ ♦ జేరు నటుల
యోగ.............................రామ. 35

సీ. కొబ్బరిచెట్టు మి ♦ గుల నెత్తుగా నుండ
దాని కాయల పీచు ♦ దళము చూచు
పక్షు లబలు లని ♦ పక్షముల్ గలిగెను
పై కెగురఁ గలిగి ♦ భద్ర మొంద
చేఁప నీటను గాలి ♦ చిక్కించుకొనుఁ గాదె
నోటిలోనే యుక్తి ♦ మాటు వడఁగ
కనులు వెనుక నున్నఁ ♦ గలుగదే కష్టంబు
నోరు దిగువ నున్న ♦ నోర్వఁ గలమె
తే. ఇటుల దృష్టాంతములె యన్ని ♦ యెంచిచూడఁ
బ్రభుఁడు లే కిట్టి పద్ధతి ♦ ప్రబలు టెటులొ
దేవుఁ డగు నీవు లే వని ♦ తెలుపఁ దగునె
యోగ........................రామ. 36

సీ. ఎందఱో సూర్యుల ♦ నేర్పాటుగాఁ జేసి
గ్రహము లొక్కొకనికిఁ ♦ గలుగఁ జేసి
గిరగిర వాని బొం ♦ గరము రీతిగఁ ద్రిప్పి
పవలును రేయియుఁ ♦ బరగఁ జేతు
వొండుండు ఢీకొన ♦ కుండఁ జేయుటకు నొం
డొంటి కాకర్షణ ♦ ముండఁ జేతు
వొక్కొక్కరీతిగ ♦ నొక్కొక్కకూటమి
తమ సూర్యు చుట్టు విం ♦ తగను దిరుగు
తే. చేయఁబడు కల్పన దిరిగి ♦ చేయకుండఁ
జిత్రమై కనఁబడెడి నీ ♦ సృష్టి మహిమ
స్తోత్ర మొనరింపఁ గలమె యో ♦ స్తుత్యచరిత
యోగ........................రామ. 37

సీ. పరమేశుఁ డుండునే ♦ వ్యక్తమా చేతనా
చేతనమం దని ♦ చెప్పఁ దగునె
యగ్ని లేనిదొకటి ♦ యవనిలే దాయగ్ని
యందుండుఁ బరమేశుఁ ♦ డరయఁగాను
చేతన మం దగ్ని ♦ చెదరిన యంతనే
చేతన మగును న ♦ చేతనంబు
నగ్ని నచేతన ♦ మం దగ్ని రేపి య
చేతనముఁ దనలోఁ ♦ జేర్చుఁ గాదె
తే. బ్రహ్మమే సృష్టియైనచో ♦ బ్రహ్మ మిఁకెటు
వ్యక్తమై యుండఁగలఁ డంట ♦ యుక్తి కాదు
పూర్ణపూర్ణ హారణమునఁ ♦ బూర్ణలబ్ధ
మగును బూర్ణమే శేషమై ♦ యమరుఁ గాదె
యోగ.........రామ. (టిప్పణి చూడుఁడు) 38

సీ. ఆదిని దను నగ్ని ♦ యావరింపఁగఁ జేసి
యందుండి యాకాశ ♦ మమరఁ జేసె
నయ్యాకసమునుండి ♦ యనిలుని సృష్టింప
దానిచే నుదకము ♦ ద్భవముఁ గాంచె
నందుండి భూతలం ♦ బవతరింపఁగ నవి
ప్రాప్తించు సృష్టికిఁ ♦ బ్రకృతి యయ్యె
భూతపంచకము వి ♦ భూతియా పంచీక
రణ నియమముల కా ♦ రణము లందుఁ
తే. దగిలి పంచభూతములందుఁ ♦ దనరి తుదకు
నణఁచుక్రమముగ భూతము ♦ లైదు నెవఁడు
వాఁడె నీవెయై నన్ను గా ♦ వఁగ లేవె
యోగ.........రామ. (టిప్పణి చూడుఁడు) 39

సీ. వ్యక్తులయం దన ♦ లాకాశ పవ నాంబు
భూతత్వ మను కోశ ♦ ములను బొంది
వెలసి క్రమముగ న ♦ వి విలయమైనను
బూర్ణ తేజస్వియా ♦ భూత భూతి
వ్యష్టియందునను స ♦ మష్టియందును గూడఁ
బూర్ణుఁడవైయొప్పు ♦ పుణ్యమూర్తి
సకల గుణాతీత ♦ సర్వజ్ఞ సర్వేశ
నిఖిల లోకాధార ♦ నీలవర్ణ
తే. బ్రహ్మమయుఁడ యీశ్వర పర ♦ బ్రహ్మమూర్తి
నిర్విశేష సాక్షిపురుష ♦ నిగమవేద్య
నిన్ను సేవింతు నుతియింతు ♦ నన్ను మనుప
యోగ.....................రామ. 40

సీ. సింహకిశోరంబు ♦ చిరకాల మొకమేఁక
మందలోఁ బెఱుగ నా ♦ మంద కొండు
సింహంబు రాఁ జూచి ♦ చెదరె మేఁకలతోడ
దారిలో సెలయేరు ♦ దాని నడ్డ
నీళ్ళలోఁ దెలియఁగ ♦ నిజరూపు బెదరక
నిలిచి సింహంబుకై ♦ నిక్కి చూచె
నది చెంగలించఁగ ♦ నిది చెంగలించుచు
సింహంబు కైవడిఁ ♦ జెలఁగు నటుల
తే. జీవు లనుభవమున జ్ఞాన ♦ శిక్ష గలుగ
జలజ మృగమానవేత్యాది ♦ జన్మమెత్తి
చివర రామయోగి వలెను ♦ జేరు నిన్ను
యోగ.....................రామ. 41

సీ. శరణు కశ్యప సర్వ ♦ శాస్త్ర కోవిద నీకు
శర ణాత్రి బ్రహ్మిష్ఠ ♦ చంద్రజనక
శరణు విశ్వామిత్ర ♦ సంధాతగాయత్రి
శరణు భరద్వాజ ♦ సంయమీంద్ర
శరణు గౌతమదేవ ♦ శంకరప్రియమౌని
శరణ మో జమదగ్ని ♦ శౌరి జనక
శరణు వసిష్ఠ భా ♦ స్కరకుల గురువర్య
శర ణగ స్త్యబుషీంద్ర ♦ సాక్షితార
తే. శరణు నారదాది మహర్షి ♦ చంద్రులార
శరణు వాల్మీకి ముఖమౌని ♦ శరభులార
మీరి శరణంటి ననుఁబ్రోవ ♦ వేఁడ నిన్ను
యోగ.....................రామ. 42

సీ. శరణు నాదకళా వి ♦ శారద యవిషాద
శరణు యోగివిలాస ♦ శైలవాస
శరణు భక్తవిలోల ♦ సద్ధర్మమతపాల
శరణు సజ్జనపాల ♦ సత్యలోల
శరణు విశ్వామిత్ర ♦ సవనరక్షణ దీక్ష
శరణు భూతప్రపక్ష ♦ చక్రరక్ష
శరణు శ్రీరఘురామ ♦ శతకోటి రవిధామ
శరణు తారకనామ ♦ శక్తి శరణు
తే. శరణు జొచ్చితి నిన్ను నే ♦ సాధురామ
పాపి నీవు నేఁ బాలింపఁ ♦ బాడియె యనఁ
బరగు శరణాగతత్రాణ ♦ బిరుద మెటుల
యోగ.........................రామ. 43

సీ. నిన్నుఁ బ్రార్థనఁ జేయ ♦ నిక్కుచుంటివి నీవు
నీ మెక్కు-వేమిరో ♦ నిగమ వినుత
సరసముగా వ్రాయు ♦ శక్తియే నీ కున్నఁ
జెప్పు నా కది నీవు ♦ మెప్పుకొఱకు
వైద్యశాస్త్రమె నీకు ♦ బాగుగాఁ దెలిసిన
విడఁగొట్టి యీ వ్యాధి ♦ విద్యచూపు
విరివిగా జ్యోతిష ♦ విద్యయే నీ కున్నఁ
జెప్పు నీ కృప మెప్పు ♦ చెందఁగలనొ
తే. పోని, కలదె బోధనశక్తి ♦ యైన నీకుఁ
జెప్పు చూతము నేను ని ♦ న్జేరు టెటులొ
మఱపు రాకుండఁ జెప్పుటే ♦ మహిమ గాదె
యోగ........................రామ. 44

సీ. అందఱిలో దూరి ♦ యాడించు చుంటి వ
ని గరువమా నీకు ♦ నీటుకాఁడ
పౌరుషం బున్నచోఁ ♦ బడుము నా యెదుట ని
న్నేమి చేతునొ చూడు ♦ మింత నిజము
చేతు లెత్తఁగ లేఁడు ♦ చేయును వీఁ డేమి
యనుకొందు కాఁబోలు ♦ నట్లుఁగాదు
నీలోన దూరియు ♦ నిన్నె యాడింపనే
పంతంబుఁ జూతువు ♦ పతితపాల
తే. చేతఁగాని వారి యెదుటా ♦ చెంగలింపు
రాముఁడ వగు సోముఁ డవఁగ ♦ నేమి మారు
కాని చూత మేది యెటులఁ ♦ గాన నగునొ
యోగ........................రామ. 45

సీ. వాతప్పు లెంచుట ♦ న్యాయంబుఁ గా దింక
లేవె తప్పులు నీకు ♦ లెక్కఁ బెట్టఁ
బరమసాధ్వియయిన ♦ పత్నిని నిందించి
యగ్నిఁద్రోయించుట ♦ యనఘ మగునె
మొఱకు మాటల విని ♦ ముగుద చూలాలినిఁ
గాననముల కంపు ♦ ఘనత నీదె
నేనె కా దింకెవ్వ ♦ రేని నీలాగు స
తిని హింస చేయఁగఁ ♦ దెగువ చేయు
తే. ఇట్టిపనులను గావించి ♦ యింక మమ్ముఁ
దప్పుపట్టుట యేమైనఁ ♦ దగవు గలదె
లోక మెఱుఁగ దనుకొనకు ♦ లోకవేద్య
యోగ..................... రామ. 46

సీ. అహమేవ బ్రహ్మంబు ♦ నహమేవ హరి యని
యద్వైత చింతనం ♦ బభ్యసించు
తపసిని ప్రభుని క ♦ శ్యపునిగాదు హిరణ్య
కసిపుఁ జంపితి విచ్చ ♦ కమ్మనకును
వేదాల కర్థంబు ♦ విప్పి చెప్పఁగ నేర్చి
ఓం నమస్సాంబ శి ♦ వోం హర యను
చతురాస్యుఁగాదు ద ♦ శముఖ బ్రహ్మను జంపి
తాఁడుదానికిఁ గాను ♦ నడుగ నేల
తే. ఇట్టి వారలఁ బరిమార్చు ♦ టేలకొ మఱి
చెప్పుమయ్యా చూత మీఁ కేమి ♦ చెప్పఁగలవొ
ఇట్టిచరితంబు దగు నీకె ♦ యెవరి కగును
యోగ..................... రామ. 47

సీ. కష్టార్జితముతోడఁ ♦ గాలంబు గడపెద
నీవలె యాచింపఁ ♦ బోవ లేదు
పోయిన నొకవేళఁ ♦ బోదునే కాని నీ
వలె దొంగవేషము ♦ వలనఁ గాదు
మూఁడంజ లర్థించి ♦ ముల్లోకములఁ గొల్చి
చేతఁ బట్టుటయు నా ♦ చేతఁ గాదు
హెచ్చైన దాతను ♦ నొచ్చెంబు లెంచకే
దిగమట్టి పెద్దనై ♦ తిరుగఁ గలనె
తే. ఇట్టి తప్పులఁ జేసి యే ♦ మెఱుఁగ నటుల
శుద్ధ బుద్ధావతారము ♦ సూటిగాను
నీ వహంబ్రహ్మ మని యుంట ♦ నేర్పు గాదె
యోగ......................రామ. 48

సీ. సన్మార్గ రక్షణ ♦ సలిపెద ననుచును
దునిమెదు వారిని ♦ ధూర్తుఁడ వఁటె
ఫలపుష్పములు నీడ ♦ పత్రంబులను నిచ్చు
చెట్లను గాలిచేఁ ♦ జెఱుపు టేమి
లోకు లందఱఁ బెంచు ♦ లోకపూజితమైన
గోవులఁ దినఁజేసి ♦ తీవు పులుల
నరులను బాలించు ♦ నరపతులను జంపఁ
బరశురాముఁడ వౌచుఁ ♦ బ్రబలలేదె
తే. యెన్నొ దుడుకుపనులఁ జేసి ♦ తెంచఁ గలమె
ఇట్టినడవడి దగు నఁటె ♦ యింక నీకు
ఘనుఁడవో యిదియఁటవె నీ ♦ ఘనత యెల్ల
యోగ......................రామ. 49

సీ. కామాదిశత్రులఁ ♦ గలిగించి కలవు మీ
కని శిక్ష నొసఁగుట ♦ కరుణ తెలివె
నేర్పుతోఁ బంచితి ♦ నీ కున్నవిమె మాకు
లేకున్న నెటువచ్చు ♦ మాకు చెపుమ
ఇంద్రజాలము నేర్చి ♦ యిచ్చవచ్చినటుల
నాడించుచున్నాఁడ ♦ వందఱి నిటు
కానరాకుండనె ♦ గమ్మ త్తెదుటఁబడి
నిలువ నీ గుండెలో ♦ నిదుర వోనె
తే. యేరి నీమాయ తెలుఁగని ♦ వారు పృధివి
పోని పోని యనినఁ బెచ్చి ♦ పోవఁ దగునె
జనులు పైఁబడ నీయాట ♦ సాగు టెట్లు
యోగ..................రామ. 50

సీ. లోకు లందఱితోఁ ♦ లోని వాఁడవు కావు
ప్రజలకు నీజాడ ♦ బయలు పడదు
కలవా రెవరు నీకుఁ ♦ గారు బంధువు లెన్న
నిర్భాగ్యులగువారి ♦ నేస్త మీవు
మత్సరంబున నిన్ను ♦ మదబలోపేతులు
పగగొందు రే వేళఁ ♦ బంత మొప్ప
మానంబు లేదింత ♦ మర్యాదయును లేదు
మాయ గైకొనికాని ♦ మలయరావు
తే. అప్పులను దేలుచుండెడి ♦ యప్ప వీవు
గూఢవర్తనుఁడవు రూఢి ♦ గుణము లేదు
తుదమొదలు లేనివాఁడ నా ♦ తోడు సుమ్మి
యోగ........................రామ. 51

సీ. ఊరుపేరులులేని ♦ యొరులెఱుంగని వానిఁ
బ్రార్థింప వలసెఁ ♦ బ్రారబ్ధ మేమొ
కులగోత్రరహితునిఁ ♦ గోటికల్పనవానిఁ
గొలువవలసివచ్చె ♦ గోలు మనుచు
గురుదేవ శూన్యుని ♦ గుణమెఱుంగనివాని
శరణనవలె గ్రహ ♦ చార మేమొ
తోడు నీడయులేని ♦ దోషమెంచెడువాని
మ్రొక్కవలసె గతి ♦ మోక్ష మయ్యొ
తే. మాటల నెఱుఁగని యతని ♦ మరుగు గలిగ
బ్రతుకవలె మనుష్యుఁడు కాని ♦ వానిఁ దలఁచి
తెలిసి తెలియని వానినిఁ ♦ దేర్చవలసె
యోగ.....................రామ. 52

సీ. ఒక్కమాటీలాగు ♦ నొక్కమాటాలాగు
నోటికివచ్చిన ♦ మాట దగునె
యందుఁ బో బాధల ♦ నొందు వారు మరేమి
సేతురం చనుకొందు ♦ చెప్ప వలెనె
ఏబాధ లేనివా ♦ రెంత విమర్శింత్రు
బాధ నొంద సబబు ♦ బోధ యేల
నేను నీలాగున్న ♦ నీవలె నుండనే
హాయిగా నానంద ♦ మయ్యనగుచు
తే. భక్తు లెంతయు దూరరె ♦ బాధ నొందఁ
దనయు విప్రలాపము దండ్రి ♦ గానము సేయు
రాను నీజోలి కలుపు నీ ♦ లోన నింక
యోగ........................రామ. 53

సీ. శ్రీరాముఁడీవు సీ ♦ తారాముఁడను నేను
మనకిద్దఱకును సం ♦ బంధ మిదియ
యీవు చిన్నమ్మను ♦ నేలుచుండఁగ నామె
యక్క పెద్దమ్మ నా ♦ యండఁ జేరె
నపుడు దత్తాత్రేయుఁ ♦ డవు నీవు నేనత్రి
జుని గోత్రుఁడ మనము ♦ చుట్టములమె
యల యత్రిజుఁడు చంద్రుఁ ♦ డయ్యెగ నీబావ
సంబంధ మొప్పెను ♦ జక్క గాను
తే. జామదగ్ని వగుటను మా ♦ జాతి వాఁడ
నాడు జిహ్వాగ్ని నుడువును నీ ♦ నామమే మొ
బాంధవముఁ జూచి యైన నా ♦ బంధ ముడుపు
యోగ..................... రామ. 54

సీ. భిన్నలింగ శరీరి ♦ భేటియై నంతనే
విభవంబుఁ జూపును ♦ విభ్రమముగ
మాట వినఁబడినఁ ♦ దేటగాఁ దోఁచియుఁ
జెవుల కింపుగ నుండఁ ♦ జేయుఁగాదె
దరిఁజేర నాసిక ♦ మరలించు మనమును
ఘ్రాణేంద్రియంబును ♦ గౌర వింపఁ
బలుకరించిన జిహ్వ ♦ వాడు దీరు నటుండు
స్పర్శగలుగ మేను ♦ పరవశముగు
తే. కామ మింద్రియోన్మాదపుఁ ♦ గాపురంబు
ఇతరవర్గముల్ వసియించి ♦ యొసగుఁ గాదె
కాన కామముడిపి నన్నుఁ ♦ గావ వయ్య
యోగ..................... రామ. 55

సీ. కాముని భోగంబు ♦ కామంబు విడువదు
దాన వచ్చెడి వ్యాధి ♦ దాఁగ కున్నఁ
దెలిసియుఁ గష్టంబు ♦ దెగియించు నేదేని
భ్రాంతి సుఖముయొక్క ♦ బల మదెంతొ
యాయువు క్షీణించు ♦ నారోగ్యముడుగును
దొంగబుద్ధియుఁ జేర్చు ♦ దోస మబ్బుఁ
బరులను బాధించు ♦ బంధంబుఁ బెంచును
బంతంబు విడువదు ♦ ప్రాణ హాని
తే. మృత్యు వాసన్న మెఱుఁగియు ♦ మిట్టి పడును
సంసరణ సుఖవ్యాధినిఁ ♦ జక్కఁ జేయఁ
దగిన వైద్యుఁడ వీవె నా ♦ తరముఁ గాదు
యోగ..................రామ. 56

సీ. వైవాహికమువల్ల ♦ వచ్చును బంధంబు
దెలిసియు దానిని ♦ వలదు విడువ
సతియుం బతియు సుత ♦ జననీ జనక ధన
తనువు లస్థిరమైనఁ ♦ దగదు విడువ
జన్మజన్మమునకు ♦ జరుగు నిటులనుచుఁ
దెలిసియు సంగతిఁ ♦ ద్రెంప రాదు
క్రోధకామాదుల ♦ కొఱకుఁగా దీ తను
వులని తెలిసి వానిఁ ♦ గలుగ వలెను
తే. పీడ సంసారబంధంబు ♦ వీడ రాదు
కలుగరాదన నీవలె ♦ మెలఁగఁ గలమె
ఇట్టి మెలులందు వలదు జ ♦ న్మించఁ జేయ
యోగ........................రామ. 57

సీ. నను శరీరినిఁజేసి ♦ నాకు నార్వుర శత్రు
లనుచరులుగఁ జేసి ♦ పనుప నేల
జయమెట్లు లభ్యమో ♦ సంసార వాహిని
నెదురీఁది దాఁటగ ♦ నేర్వవశమె
తగదు నాయెడ శక్తి ♦ తరముఁ జూడఁగ నింకఁ
బతితునితో నింత ♦ పంత మగునె
నీకు నాకును గల్గ ♦ నేకత్వ మెటుచూడ
లెమ్ము వేగమె నన్ను ♦ లేవనెత్త
తే. నెపుడు ప్రాణంబు వోవునో ♦ యెఱుఁగ రాదు
కాలభటులు గొనక ముందె ♦ మేలుకొనుము
గొబ్బున నిపుడొ దానికై ♦ గొడవ యేల
యోగ........................రామ. 58

సీ. బలములే దొక్కింత ♦ పలుక శక్తియు లేదు
పద్యమైనను వ్రాసి ♦ పాడ లేను
ఒక్కింత కదలిన ♦ నెక్కువౌ బడలిక
యాయాస మాఁగదా ♦ ధ్యాన మెట్లు
పలుమారిటు లవఁగఁ ♦ బ్రాణంబు సడలుచు
నెపుడు వీడునో దేహ ♦ మెఱుఁగ రాదు
ధైర్యంబు లేదింక ♦ దడుపు పుట్టెను నాకు
మనుతువో లేదొ న ♦ మస్కరింతు
తే. శతకమంతయుఁ బూర్తిగా ♦ జరుగు నొక్క
మెన్ని పద్యములే మైన ♦ నన్నిఁయె కొని
పరమపదమీయ వేడెద ♦ పరమ పురుష
యోగ........................రామ. 59

సీ. సశరీరినిఁ గనులు ♦ శక్యమా నెట్లైన
నశరీరినిఁ గనుట ♦ నలవి యగునె
జలచరమ్మును బట్ట ♦ శక్యమా నెట్లైన
వాయుచరముఁ బట్ట ♦ వశమె చెపుమ
బైట నుండెడి దాని ♦ పనిపట్టఁగా వచ్చు
లోనుండు నది యెట్లు ♦ లొంగు నయ్య
కాళ్లుపట్టిన దాని ♦ కాఠిన్యమది యెంత
గుండెఁజేరు నదియె ♦ కూలఁద్రోయు
తే. గణనయె కరిఁబట్టెడు జల ♦ గ్రహము నన్నుఁ
గాఱియపఱచెడి వాత ♦ గ్రహము నకును
దీనిఁ బరిమార్చు లేఁ ప్రజ్ఞ ♦ దీనబంధు
యోగ......................రామ. 60

సీ. కనఁబడ దెక్కడఁ ♦ గాచియుండు నెచటొ
లేవ నుద్ఘాటించి ♦ లేచి మించుఁ
బెనఁగొని బంధించుఁ ♦ బెకలించు నరముల
భయపెట్టుఁ బ్రాణంబుఁ ♦ బాపునటుల
కూలఁద్రోసియు డాఁగు ♦ కోష్టంబు లందును
మాటరాకుండనె ♦ మాటియుంచు
మకరధ్వజమ్మును ♦ బ్రమందించియు వసంత
కుసుమాకరమ్మును ♦ గ్రుంగఁ జేసె
తే. వాతరాక్షసు లెందఱో ♦ పాసి రయ్య
అంకుశము లెల్ల నిపుడు ని ♦ రంకుశ మయె
ఆయుధములును బలములు ♦ నణఁగిపోయె
యోగ......................రామ. 61

సీ. ఏరూపమున దీని ♦ యేపడంపఁగ వచ్చు
నేవారిఁబిలిచెద ♦ నేది శరణు
ఏవాఁడు వారించు ♦ నీవాయు సంజాతు
నెవ్వరడ్డము సేతు ♦ రీగ్రహంబు
లేరె యెవ్వరు దీని ♦ లేకుండఁగాఁ జేయ
దీనుల మొఱ విను ♦ దిక్కు లేదె
మ్రొక్కి వేఁడెద నేను ♦ రూఢిగా నెవరున్నఁ
గరుణతోఁ దులత నన్నుఁ ♦ గాచుటకును
తే. వాయుజముగాన మొగమోట ♦ వాయుజునకు
హరి మరుత్వంతుఁ డగుటచే ♦ నరయఁ డేమొ
యిఁక నెవరిని శరణనుటొ ♦ యెఱుఁగ రాదు
యోగ........................రామ. 62

సీ. ఓ శిష్టజనపక్ష ♦ యో పాతక విపక్ష
యో దీన జనరక్ష ♦ యో పరోక్ష
యో కర్మఫలదాత ♦ యో తత్వనిర్ణేత
యో మనోరథ దాత ♦ యో వినీత
యో భక్తపరిపాల ♦ యో సత్యజనలోల
యో కామప్రతికూల ♦ యో సుశీల
యో సంసృతివినాశ ♦ యో సంహృతక్లేశ
యో యోగిసంకాశ ♦ యో ప్రకాశ
తే. యో శ్రితజనదుఃఖవియోగ ♦ యోవిరాగ
యో దయాధారదేవ యో ♦ యోగిభావ
వేఁడెదను నిన్ను నను బ్రోవ ♦ వేగఁజూడు
యోగ........................రామ. 63

సీ. నర్తకునివలెఁ బెక్కు ♦ మూర్తులతో నాడు
　　సాక్షిశక్తికి చిత్ర ♦ చారునకును
సౌమ్యున కపవర్గ ♦ సౌఖ్యసంవేదికి
　　దీనజనావనా ♦ ధీనునకును
అఖిలేంద్రియద్రష్ట ♦ కధికారునకు భక్త
　　వరులను బోషించు ని ♦ ర్వాణ పతికి
జాగరము సుషుప్తి ♦ స్వప్నముల కతీతు
　　న కనంత విమల వి ♦ జ్ఞాన ఖనికి
తే. దురిత దూరునకు వికార ♦ దూరునకును
లబ్ధవర్ణుల కెందు న ♦ లభ్యునకును
ధర్మపాలకున కొనర్తు ♦ దండ మెపుడు
యోగ... ... ... ... ... ... ...రామ　　64

సీ. తలఁపవే నాపాటుఁ ♦ దనువులందును నిన్నుఁ
　　దెలియు వారలఁ గృపఁ ♦ దేల్చు వాఁడ
కలవె నాపాలి నా ♦ కష్టంబుఁ గనుగొనఁ
　　గలిమిలేములఁ జేసి ♦ కులుకు వాఁడ
కష్టకారణమగు ♦ కర్మంబుఁ గడతేర్చి
　　యవ్యయదేహంబు ♦ నతుకు వాఁడ
విశ్వసింపవుగదా ♦ విశ్వమంతయు నిండి
　　విశ్వకారకుఁడవై వెలయు వాఁడ
తే. కలఁడు కలఁడని చెప్పెడో ♦ కలుగు వాఁడ
నిన్ను శరణంటి శరణార్థి ♦ నన్నుఁ గావ
వినవె చూడవె తలఁపవె ♦ వేగరావె
యోగ... ... ... ... ... ... ...రామ.　　65

సీ. ఆత్మస్వరూపుఁడౌ ♦ యాదిత్యుఁడవు నీవు
సృష్టిస్థితి లయముఁ ♦ జేయు పితవు
మాతృకారకుఁడుగా ♦ మమ్మేలు శశివయి
మానసికములకు ♦ మాతవౌదు
క్రోధ రూపముతోడఁ ♦ గుజుఁడవై యొప్పుచు
ఋణబంధములనెల్ల ♦ రూపడంతు
సౌమ్యుఁడవై నీవు ♦ జ్ఞానంబు నొసఁగుదు
జీవుఁడవై నీవు ♦ జీవ మిడెదు
తే. కవి యయి కళలు కలిమియుఁ ♦ గలుగఁ జేతు
శనివగుచు నీల సర్వ నా ♦ శనముఁజేతు
వవుదువయ గ్రహారూప జ ♦ నార్దనుఁడవు
యోగ......................రామ. 66

సీ. అద్వైత సిద్ధాంతి ♦ యధ్యాత్మఁ జూచితే
రామానుజాచార్య ♦ రాముఁ డేఁడి
ద్వైతమతాచార్య ♦ దామోదరుం డెట
బౌద్ధమతాచార్య ♦ బుద్ధి యేది
ఇస్లామ్మతాచార్య ♦ యీశ్వరుఁ గాంచితే
బ్రహ్మమతాచార్య ♦ బ్రహ్మ మేది
సిక్కు-మతాచార్య ♦ శ్రీవిష్ణుఁ గాంచితే
క్రీస్తుమతాచార్య ♦ కృష్ణుఁ డేఁడి
తే. పారశీక జొరాస్టర ♦ ప్రభు నెఱుఁగుదె
జైనమతమహావీరుఁడ ♦ జినుఁ డెటేగె
నోదయానంద పరమాత్మ ♦ యేది తెలుపు
యోగ......................రామ. 67

సీ. ఆళ్వారులార యో ♦ యరవిందఘోషుఁడ
శ్రీరాము బంపరే ♦ శీఘ్రముగను
రామకృష్ణయతీంద్ర ♦ రాముఁడు నీలోన
దాఁగె నేమో చూచి ♦ తగదె పనుప
నోవివేకానంద ♦ యోరామ తీర్థుఁడ
శ్రీరాముఁ డుండు మీ ♦ చెంత సుమ్మి
రామదాసు కబీరు ♦ రాము దాఁచఁగ నేల
రమణమహర్షి మా ♦ రాము వీడు
తే. అనుచు నిన్ను సాధించు మా ♦ యార్య వరుల
వేఁడితి నిటు మోమోడి వే ♦ వేగ వచ్చె
ద వని నీకు నిర్లక్ష్యమ్ము ♦ దగదు సుమ్మి
యోగ..........................రామ. 68

సీ. ఇంద్రియోన్మాదంబు ♦ నీల్గింప కున్నను
గరుణ గలుగ దందు ♦ కాని యటులె
ఇంద్రియోన్మాదంబు ♦ నీల్గింతు సుఖముగ
వినుము నావిధ మెల్ల ♦ విపులముగను
దర్శన మొకమారు ♦ దయచేసినన్ జాలు
నన్నియుఁ జక్క-నౌ ♦ నద్భుతముగ
నీసహాయము లేక ♦ నెఱవేర్ప వచ్చునే
శక్తికసాధ్యము ♦ సాధ్యముగను
తే. కనఁబడిన నేమియొ యడిగి ♦ కష్టపెట్టఁ దలఁచి
బురుడా యిది యనుచుఁ ♦ దలఁప
మాయమాటలు పల్కెడి ♦ మతము
యోగ..........................రా

సీ. వరములిచ్చెద నన్న ♦ వలదు నాకెంతయు
నీదు దర్శనమె య ♦ న్ని వరములును
చూపులు నినుఁజూడఁ ♦ జూడవు మఱియేమి
వీనులు నినువిన్న ♦ విన వింకేమి
జిహ్వా నీతో వచిం ♦ చెడి చవి కన్గొనఁ
గోరదే రుచులను ♦ గొంచె మైన
నీగంధ మలవడ ♦ నిగిడెడి ఘ్రాణంబు
ఘ్రాణించ దితరమా ♦ గంధ మింక
తే. తనువు నీస్పర్శ ♦ దగిలినఁ దాఁక దేది
యరయ పంచేంద్రియ వ్యవ ♦ హార మెల్ల
నీమొదఁ దిరిగి కదలక ♦ నిలిచియుండు
యోగ..................... రామ. 70

సీ. ఈకామ వాంఛ నా ♦ కేరీతి విడువదు
నీదివ్యసంగతి ♦ నెరప కున్న
నీక్రోధ తీవ్రంబు ♦ నేలాగు నిలువదు
నీరూపమును జూపి ♦ నిలుప కున్న
నీలోభ వ్యాపార ♦ మేవిధంబునఁ దీరు
నినుఁబాయ కుందు నే ♦ ననినదనుక
నీమోహ తాపంబు ♦ నేమిట నారదు
ననుఁ జేరి నెయ్యంబు ♦ నాటకున్న
తే. నీమదము తగ్గునే నన్ను ♦ నేలు దనుక
మత్సర మణఁగునే పర ♦ మాత్మ గాక
శత్రువులఁ జక్కఁజేయఁగ ♦ శపథ మొసఁగు
యోగ..................... రామ. 71

సీ. నిను నేను నిటుపైని ♦ కనుఁగొనఁ దడవైన
నేలపై మేనును ♦ నిలువదు సుమి
నేలపై మేనును ♦ నిలువక యటమున్నె
ధైర్యంబు నొక్కటఁ ♦ దరలి పోవు
ధైర్యంబు నొక్కటఁ ♦ దరలిన పిమ్మటఁ
జైతన్యమును గూడఁ ♦ జనును సుమ్ము
చైతన్యముంగూడఁ ♦ జనిన యప్పుడ మేనఁ
బ్రాణమ్ము లుండక ♦ పాయు సుమ్ము
తే. ప్రాణములు వోవు పిదప నో ♦ ప్రాణదాత
వచ్చి నీవేమి సేసెదో ♦ పలుకుమయ్య
నినుదగులు ననువీడుట ♦ నీతియగునె
యోగ........................రామ. 72

సీ. స్థూలశరీరమ్ము ♦ చూడఁగ ద్వివిధ మ
న్నమయ ప్రాణమయ గో ♦ శములనంగ
పృథ్వితత్వమొకటి ♦ పిత్త వాత శ్లేష్మ
మయమగు జలతత్వ ♦ మగు మఱొండు
ప్రథమకోశము జీవి ♦ వాయఁగ నవి జడ
మగు నది మృతి యని ♦ యనఁగఁ బరగు
మొదటి కోశము నశిం ♦ చు దనుక రెండవ
దానితో జీవుఁ డ ♦ ద్దాన నుండు
తే. మొదటిది నశింపఁ జెడు రెండ ♦ వదియుఁ గాని
జీవి యిలఁగొన్ని నాళ్ళుఁడుఁ ♦ జింత తోడ
నపరకర్మ త న్నిలనుండి ♦ యంపు దనుక
యోగ........................రామ. 73

సీ. స్థూల కోశములు వో ♦ సూక్ష్మదేహములైన
వాయు రాకాశాగ్ని ♦ కాయము లగు
మానస విజ్ఞాన ♦ మానంద కోశము
లందు జీవుఁడు బొందు ♦ ముందు గతిని
మానస కోశంబు ♦ నానుచుఁ బ్రేతమై
యా భువర్లోకమై ♦ యలరుఁ బదప
సాంవత్సరికములు ♦ జరుగంగఁ బితరుఁడై
యొకచోట నచ్చట ♦ నుండి యుండి
తే. కొంత కాలంబు నరుగంగ ♦ నంతఁ బొందు
వింత దేహము యమశిక్ష ♦ కొంత నొంద
నిది భువర్లోక చరితమై ♦ యొసఁగు నెపుడు
యోగ..................రామ. (టిప్పణిచూడుడు) 74

సీ. మానసకోశంబు ♦ మఱివోవ నంతట
విజ్ఞానమయ కోశ ♦ మాజ్ఞఁ బొందు
పుణ్యమనుభవింపఁ ♦ బోవును నాకంబు
నది సరిపోవఁగ ♦ నచటు వాసి
యవతరించుఁ బృథివి ♦ ననుభవజ్ఞానము
నకు మునుపటిది పు ♦ నాది కాఁగ
సత్కర్మమున జీవి ♦ జ్వలన దేహముతోడఁ
బోవు తపోలోక ♦ భువనమునకు
తే. జ్ఞాని సత్యలోక మరుగు ♦ శ్రమము లేక
ముక్తుఁడై పరమానంద ♦ మునను నొప్పు
దేవలోకముల జరుగు ♦ దేహి కిటుల
యోగ..................రామ. 75

సీ. పుణ్యాత్ములకు వేగఁ ♦ బోవును గోశముల్
పాపులకు విడవు ♦ బంధమునను
తనయుండు సేయు శ్రా ♦ ద్ధాదులు జీవికి
సాయముచేయుఁ గో ♦ శములు వీడ
జ్ఞానులు విడిచి స్వ ♦ శ క్తిచేఁ దనువుల
ముక్తులౌదురు లోక ♦ ములకుఁ బోక
మూర్ఖులు సంబంధ ♦ మును వీడ కిచటనె
చచ్చిపుట్టుచునుంద్రు ♦ చక్రవృద్ధి
తే. ఇట్టివారి కూర్ధ్వగతి య ♦ దెట్లు కలుగుఁ
బలుమరు నధోగతుల లోనఁ ♦ బరగుచుండ
జ్ఞాని యతనూజుఁడైన మో ♦ క్షంబుఁ జెందు
యోగ..........................రామ. 76

సీ. మృత్యువనుచు నప ♦ మృత్యువంచును రెండు
తెఱఁగులఁ గల్గును ♦ మరణ మిలను
నిర్ణీతకాలము ♦ నిండుచోఁ గల్గిన
నిధనమె మృత్యువు ♦ నిశ్చయముగ
బలవంతముననైనఁ ♦ బ్రమాదికముననో
యజ్ఞానమునఁగూడ ♦ నయ్యెడి మృతి
ప్రారబ్ధమైనచోఁ ♦ బ్రాణిపొందును గతి
యపమృత్యువైన ద ♦ య్యమ్మె యగును
తే. నిశ్చితంబైన యాయువు ♦ నిండుదనుక
బొంది లేక కడు వెతలఁ ♦ బొంది పిదప
శేషప్రారబ్ధము కొఱకుఁ ♦ జిక్కు వడును
జనన మదికమా యనుభవ ♦ జ్ఞానమునకు। యోగ...రామ.

సీ. ప్రారబ్ధ మరణమో ♦ బలవంతమరణమో
యరయ లేఁడెంత నే ♦ ర్పరియొ యైన
శక్తి గాలేఁది ప్రాణి ♦ సంరక్షణము సేయ
యత్నింప వలె ఫల ♦ మవని పోని
మనయత్నమును దైవ ♦ మనుకూలతయుఁ జేరి
కార్యసిద్ధికి రెండు ♦ కతము లగును
గుణకారమున రెండు ♦ గుణిజము లుండక
ఫలమురానేరని ♦ పగిదిగాను
తే. అంతయును దైవికం బని ♦ యనుటవలన
సర్వచేష్టలు నప్రయో ♦ జనము లగును
ప్రాణిలో శక్తియును దైవ ♦ బలమె కాదె
యోగ........................రామ. 78

సీ. ఎన్నిమారులొ పుట్టి ♦ యేగుచుండు మనము
జననీ జనక సతీ ♦ ధన సుతాది
సంసార మోహ సం ♦ చయము బోవఁగ నిందు
దేనికిఁ జింతించి ♦ దీన మగుట
ప్రతిజన్మమున నిట్లు ♦ మతిలేక చింతింపఁ
జింతయే యగుచుండు ♦ జివర లేక
పోవు వానినిఁ గూర్చి ♦ పొక్కుచుండఁగ నేల
కలిమి లేములు లేని ♦ కలిమి దగదె
తే. నశ్యమగు దానికిఁ దగని ♦ నడత వలన
ధనము వనితల కొఱకిటుఁ ♦ దగులు వడుట
యవసరమె బాధ్యత యొకింత ♦ యైనఁ గలదె
యోగ.............................రామ. 79

సీ. దేవుఁడే లేఁడని ♦ తెలిసినటులఁ బలుక-
తెలియని వారల ♦ తెఱవు వోవు
దేవుండు గలఁడని ♦ తెలిసి యుపేక్షించు
వారియెడల నట్లు ♦ వఱలె దీవు
ప్రభుఁడు సర్వజ్ఞుఁడై ♦ ప్రబలుచుండఁగ నేల
మన వృథా యాతన ♦ యనుచు నెపుడు
నిన్ను మరువ కెప్డు ♦ నన్నియు నీ వని
యంత నీదియె భార ♦ మనెడు వాని
తే. సర్వకార్యములను నీవ ♦ సలుపుచుండి
వాని యభివృద్ధిఁ జూతువు ♦ వలసినటుల
నిం దెవరు నేర్చువారలొ ♦ యెఱుఁగ నగును
యోగ.....................రామ. 80

సీ. నేను నీపూజలు ♦ నెరవేర్పఁగా లేదు
నేను నీధ్యానంబు ♦ నెఱప లేదు
నేను నీకీర్తనల్ ♦ నేర్చి పాడఁగ లేదు
నేను నీభజనను ♦ నెగడ లేదు
నేను నీసత్కథల్ ♦ నెమకి చెప్పఁగ లేదు
నేను నీవాసంబుఁ ♦ గాన లేదు
నేను నీమహిమలు ♦ నిర్ణయించుట లేదు
నేను నీయెడ భక్తి ♦ నిలుప లేదు
తే. ఇంతకును గారణమ్ము నా ♦ హృదయ రుజయె
కానఁ గరుణతోడను దాని ♦ కత మడంచి
కొండ నెక్కించు నను వేగఁ ♦ గొల్వనిన్ను
యోగ.....................రామ. 81

సీ. ఆత్మ నీవగుఁ గాదె ♦ యగును సీత మనంబు
ప్రాణాదికం బగుఁ ♦ బరిజనంబు
నాశరీరమ్మె యా ♦ నగరి యగు విషయ
భోగము లుపచార ♦ పూజనములు
నిదుర యగు సమాధి ♦ పదచారమె ప్రదక్షి
ణంబు సంస్తుతి యగు ♦ నాదు మాట
ధ్యానంబె నాదు భో ♦ గాసక్తి యంతయు
నానందమె విషయా ♦ నంద మయ్య
తే. నేను చేసెడి కృత్యముల్ ♦ నిన్నుఁ గూర్చి
రక్తి వసియించు నా యంత ♦ రంగమందు
నెచట వాసముండినఁ దక్క ♦ వేమి నీకు
యోగ..................... రామ. 82

సీ. పాప భీతికి నిష్ట ♦ ఫలసిద్ధికిని బంధ
ముక్తి కెంతయు నాదు ♦ శక్తి కొలఁది
స్తుతి యొనరింపంగఁ ♦ దొందరపడు జిహ్వ
ధ్యానంబునకును జి ♦ త్తంబు దగులు
మొక్కుమని శిరమ్ము ♦ ముచ్చట పడుచుండు
పదములు నినుఁ గొల్వఁ ♦ బథముఁ జూపుఁ
బూజసేయు మనుచుఁ ♦ బోధించుఁ జేతులు
కన్నులు నినుఁ జూడఁ ♦ గదలు మనును
తే. చెవులు నీకథాశ్రవణంబుఁ ♦ జేయఁ గోరుఁ
గాన నిపు డట్లు నేఁ జేయఁ ♦ గలుగుటకును
గరుణసేయు మనుజ్ఞ యోం ♦ కార మూర్తి
యోగ..................... రామ. 83

సీ. చిన్నవోవుదుఁగాదె ♦ క్షేత్రాధిపతులలో
నన్నుఁ బ్రోవక యున్న ♦ నాకవినుత
యపకీర్తిగాదె య ♦ న్యమతస్థజనులలో
దాసుని రక్షింపఁ ♦ దలఁప కున్న
లోకువ గాదొకో ♦ లోకంబులో నిట్లు
భక్తుని రోగంబుఁ ♦ బాప కున్న
నగుబాటు గాదొకో ♦ నాస్తికులందింక
నాశ్రితావన బిరు ♦ దాంకితంబు
తే. దీనితో నీప్రతిష్ఠయుఁ ♦ దీఱి పోవు
నెంతలో వచ్చు నపకీర్తి ♦ నెఱుఁగ వైతి
మ్రొక్కితిని నిన్ను మఱివేఱ ♦ దిక్కు లేక
యోగ.......................రామ. 84

సీ. రామచంద్రుఁడ నీవు ♦ రాజవు గావున
వేఁట యనిన నీకు ♦ వేఁడుక గద
చక్కని యొకవిడి ♦ స్థల మొండు వేఁటకు
నుండ నటునిటుఁ బో ♦ నుంచు టేల
నా మనో వనసీమ ♦ నడతెంచు మాత్సర్య
మదక్రోధమృగముల ♦ మాటు పెట్ట
మృగయా వినోదంబు ♦ మిక్కిలి లభ్యమౌ
లేఁడివేఁటమియు ♦ లెక్క లేదు
తే. కోఁతివేఁటయుఁ గూడదు ♦ గొప్పకాదు
నీగుఱి కగు మృగము లివి ♦ నిశ్చయముగఁ
గాన నీవనమున నీవు ♦ కాచి యుండు
యోగ.......................రామ. 85

సీ. సంసార వనసీమ ♦ సంచరించుచు నుండు
యువతి (కు) బాహుశిఫల ♦ నూగులాడు
నాశా విటపి శాఖ ♦ నాట లాడుచు నుండు
నాశ్చర్యముగ నిటు ♦ నటును గెంతు
నాహృదయకపి ను ♦ న్నత భక్తి గుణముచేఁ
గట్టుమా కపివరున్ ♦ గట్టి నటుల
క్రీడార్థమా సృష్టి ♦ క్రీడామృగంబులఁ
గట్టుకేల యటంచుఁ ♦ గట్ట కున్న
తే. వాని క్లిష్టమగు వికార ♦ వర్తనమును
గని వినోదించు కినియఁ ద ♦ గదు సు మీవు
కాన నాదోష మెన్నక ♦ కావఁ దగును
యోగ..................... రామ 86

సీ. కాంత( ంతు ) లెందఱఁ జూడఁ ♦ గాము మంతగ వృద్ధి
యెంతవిత్తము గూడ ♦ నంత యాస
తెలిసి నామన మేమి ♦ త్రెంపదు మోహంబు
రోసి రోయదు కాంత ( ంతు ) ♦ రోఁత రోకు
విడిచియు విడువదు ♦ విత్తమందలి యాశ
దానిఁగూర్చు విధమ్ము ♦ దలఁచి విసుఁగు
నంతకంతకు నెక్కు ♦ వయ్యెడి సంసృతి
వదలి వదలలేక ♦ వలచి వందు
తే. నంతయును నిట్లు సందిగ్ధ ♦ మయ్యె బ్రతుకు
నెటుఁ గనినఁ గష్టమె ♦ భయమె ♦ యెంచి చూడఁ
జెప్ప కేమి నీస్తుతిఁ జేసి ♦ చేయలేను
యోగ..................... రామ. 87

సీ. యువతీ యువకులకు ♦ నుద్వాహ మొనరింప
వెలయుదు రన్యోన్య ♦ ప్రేమ ననుట
నమ్మఁగాఁ దగదది ♦ పరులు మారుచు నుందు
రెప్పటి కపుడె సు ♦ మ్మెంచి చూడ
నిపు డిష్ట మగు నది ♦ యపు డిష్టమై యుండ
దిష్టమౌ కారణ ♦ మేమి నిలుచు
నన్యదేశముల నీ ♦ యాచార మేమయ్యె
విషయములకు మేర ♦ వెదుక లేదు
తే. సతియుఁ బతియును సంసార ♦ సంగతిఁ గని
కర్మయోగము కొఱకె యీ ♦ కర్మమనుచుఁ
జింత సేయుటొకటె సుమీ ♦ చేర్చు సుఖము
యోగ............................రామ. 88

సీ. బాల్యవివాహముల్ ♦ పలుకష్టములఁ దెచ్చె
నని యవి పాపుట ♦ కగునె యిట్లు
మొదటి కష్టము కొంత ♦ వదలిన మఱికొన్ని
కలుగు మన కది య ♦ కార్య మగును
విధవల సంఖ్యయు ♦ నధికమౌ ననఁ బుత్రు
డుండని విధవల ♦ కొప్పఁ బెండ్లి
యతిబాల్యమునఁ బెండ్లి ♦ యాపుటకై పెండ్లి
వయసుగాఁ బదుమూఁడు ♦ పలుకవలయు
తే. పెద్దపిల్లకుఁ బెండిలి ♦ కద్దనినను
దానము రజస్వలాయైనఁ ♦ గానఁ బడమి
యొప్పు బాల్యవివాహమె ♦ యోగ్యులకును
యోగ.........రామ. (టిప్పణి చూడుఁడు) 89

సీ. వేదమతము మాది ♦ విదితమ్ముగా నంచు
మాయఁజేయుచు మాకు ♦ నాయకులయి
వేదమతవిరుద్ధ ♦ విధమంతయును బెట్టి
దేశోద్ధరణమని ♦ తెలియఁ డందు)
దేశోద్ధరణ మాట ♦ దేవుని కెఱుకయ
మతసంఘముల నాశ ♦ మ్మార్గమిదియ
జాతులు వలదను ♦ జనుఁ డెఱుంగఁడు సంఘ
జీవము మత మవి ♦ చ్ఛిన్నమనియు
తే. మతముగూర్చి తెలిపెడు సం ♦ స్కృతము రామి
ఇంతకును గారణముగద ♦ యెంచిచూడఁ
గాన దీనిఁ బ్రధానము ♦ గాను జేయు
యోగ..................... రామ. 90

సీ. చండాల పతిత నీ ♦ చకృతులం చస్పృశ్య
లవరె ముత్తెఱఁగుల ♦ నాది యందు
చండాలు రన జాతి ♦ చండాలురు విమతు
లగు ప్రథమ నివాసు ♦ లరయ వారు
వృత్తిచే నస్పృశ్య ♦ వేష్టులగు రజక
శబర కైవర్తలు ♦ చర్మకార్లు
బ్రహ్మమతమువారు ♦ పాపకర్మముఁజేయఁ
బతితులై వెలిపెట్టఁ ♦ బడిరి వీరు
తే. బ్రహ్మమతము గా దనువారు ♦ పంచములగుఁ
బలుకఁబడరు విమతులు ప్రాఁ ♦ బలుకు లందు
బ్రాహ్మణ మతస్థులె చతుర్వ ♦ భాగమైరి
యోగ..................... రామ. 91

సీ. ఆర్యులే ద్విజులై ర ♦ నార్యు లార్యమతముఁ
జేర శూద్రులనుచుఁ ♦ జెప్పఁబడిరి
రామానుజాచారి ♦ ర క్తితోఁ గొందఱు
పంచములకు విష్ణు ♦ భ క్తి నేర్ప
వారిలోఁ గొందఱు ♦ పరివ ర్తనముఁ జెంది
స్పృశ్యులై రిగద య ♦ స్పృశ్యులంత
వై ష్ణవులగుచు గో ♦ వధములోనగు దురా
చారముల్ మానని ♦ వారటుంద్రి
తే. మదనమోహనమాలవ్య ♦ మహితదీక్ష
పెట్టి వీరి యస్పృశ్యత ♦ వీడఁ జేయు
చుండుట ప్రశ స్తమైయొప్పు ♦ చుండుఁగాదె
యోగ............................రామ. 92

సీ. వేదమతముఁ జేరి ♦ వృ త్తిచే నస్పృశ్య
లైన చండాలుర ♦ నంట రాదె
శుచిగనుండఁ బలితు ♦ లు చిరకాలముననే
యంతరించిరిగ మ ♦ తాంతరులయి
యన్యమతముల వా ♦ రందఱు స్పృశ్యులై
యుండ నస్పృశ్యత ♦ యుండఁ దగదు
కాన దురాచారి ♦ కాని చండాలుర
వదలుఁడు గుడి మండ ♦ పంబులకును
తే. కాని యిట్టిసాంఘిక మత ♦ కార్యములను
రాజ్యతంత్రముననను జేర్ప ♦ రాదు దానఁ
గలహములు పుట్టి సంఘము ♦ బలము తగ్గు
యోగ............................రామ. 93

సీ. కాంగ్రెస్సు నాయకుల్ ♦ కార్యమెంచక యిట్టి
రాజ్యతంత్రముఁ బూని ♦ ప్రజ లొడఁబడి
కలను రద్దుపఱచెఁ ♦ గలుగు చట్టములను
బెట్టి ప్రభుత్వమున్ ♦ విశ్వసింప
కుండఁ జేయుటఁ జూడ ♦ నొండు గానము వీరు
దేశాపకారులై ♦ తేలు టగును
గాంధీమహాత్ముఁ డీ ♦ కారణమునఁబోలు
కాంగ్రెస్సు విడిచెను ♦ గాని యెట్లొ
తే. యదియు నామకార్థమగుచుఁ ♦ దుదకు నతఁడు
గూడ నిట్టి తప్పుడు త్రోవ ♦ గుండఁ బోవు
టారయ స్వరాజ్య మ్మెంతయు ♦ దూరమగును
యోగ........................రామ. 94

సీ. ప్రముఖుఁడొండు ప్రజల ♦ వ్యగ్రతఁ జూప గా
డిద వెంబ్రడుక తల ని ♦ డఁ దనవారు
నది చూచి యటుఁ జేయ ♦ నది రోమరహితమౌ
నట్టు లనుసరింతు ♦ రయ్య ప్రజలు
మతమెప్పుడు ప్రభుత్వ ♦ గతి యయ్యెనే యిందు
పాశ్చాత్యులను జూచి ♦ పరగ నేల
యఖిలభారత పండి ♦ తాళి మతముగను
జరుపుము మామతా ♦ చారమింక
తే. ప్రజలు దేశము వృద్ధియౌ ♦ ప్రభుత నెఱపి
శాంతిఁ జేర్చి ప్రజలకు వి ♦ శ్రాంతి యొసఁగి
యందఱను ధర్మవర్తన ♦ మందు నుంచు
యోగ........................రామ. 95

సీ. నీభక్తి చేసిన ♦ నిర్మలాత్మునిఁ గాంచి
　　దండధరుఁడు గూడ ♦ దండ మిడును
నీసేవఁ జేసెడు ♦ నిశ్చయాత్మునిఁ జూచి
　　నిర్జరుల్ చెలిమిని ♦ నెఱపు చుందు)
నిన్ను నేమరకుండు ♦ నేర్పుకాని నెఱింగి
　　దోషగ్రహములును ♦ దోసిలొగ్గు
నిన్ను యన్నిటఁ జూచు ♦ నియతాత్ముఁ గనుఁగొని
　　దుర్నిమిత్తంబులు ♦ దూలిపోవు
తే. శత్రుఁడును మిత్రుఁడగు నగ్ని ♦ చలువఁజేయు
విషము గూడ నాహారమై ♦ వృద్ధిఁజేయుఁ
గ్రూరమృగములు మఱి సౌమ్య ♦ మృగము లగును
యోగ..................రామ.　　96

సీ. నిన్నెప్డు మదినెంచు ♦ నిర్మలాత్ములకు వి
　　పత్తైన సంపత్తు ♦ వలెను జరుగుఁ
బాండవుల్ వనములోఁ ♦ బ్రఖ్యాతి వహియించి
　　రాజ్యంబుఁ బడయరే ♦ రంజితముగ
నిన్నెప్డుఁ దలఁపని ♦ నీచాత్ములకు సం
　　పత్తు గూడ విపత్తు ♦ వలెను జరుగుఁ
గౌరవుల్ రాజులై ♦ కడుఁ బరాభవమొంది
　　సంపత్తు గోల్పోయి ♦ చావ లేదె
తే. నిన్నుఁ దలఁపని సంపత్తు ♦ కన్న మిగుల
నిన్నెపుడుఁ దలఁచు విపత్తే ♦ నేటు గాన
నిన్నుఁ దలఁచు సంపద నాకు ♦ నిర్ణయించు
యోగ.........................రామ.　　97

సీ. సర్వజ్ఞుఁడనె నేను ♦ జక్కఁగాఁ బ్రజ్ఞతో
మేలు కీడు తెలిసింగి ♦ మెలఁగుటకును
మే లగునని చేయ ♦ మిగుల కీడే కల్గు
తలపఁగా రానట్టి ♦ తంట వలవ
నీ సహాయము లేక ♦ నెగ్గునే యెవఁడైన
నీవు కరుణసేయ ♦ నెగడుఁగాని
దారిద్ర్యబాధకై ♦ తలఁచి నూతన్ గూల
తృప్తిగా ధనము ప్రా ♦ప్తించు నచట
తే. నీవు దయఁజూడ నందఱు ♦ నేర్పుకాండ్రె
కాన నెదిమేలో నా కది ♦ కనపఱుచుము
త్వరగ నన్నుద్ధరింప స ♦ర్వజ్ఞ నీవు
యోగ... ... ... ... ... ... ...రామ. 98

సీ. కోరఁగా వచ్చెనే ♦ కూడని వన్నియుఁ
గోరఁడెవఁడు వాని ♦ గొంచెమైనఁ
గోరకుండనె వచ్చు ♦ క్షోభంబు లన్నియుఁ
గోరకుండనె పోవు ♦ గొంకు వలదు
కోరఁగా వచ్చెనే ♦ కొంచెమైనను గాని
సౌఖ్యంబు లేవియు ♦ జనుల కెందుఁ
గోరఁగా సుఖము చే ♦ కూరుచో నందఱు
సుఖమె పొందవలెను ♦ సూటిగాను
తే. కానఁ గోరికచే నేమి ♦ కానఁబడదు
కోరికలు మాని కర్మముల్ ♦ కోరి చేయ
నదియె సమకూర్చు శాశ్వతం ♦ బైన సుఖము
యోగ............................రామ. 99

సీ. అశ్రద్ధఁ జేయుచు ♦ నరయ కుండుట చేత
దురదృష్ట హాంకార ♦ దుఃఖములను
మూఁడుపంక్తుల బ్రహ్మ ♦ ముమ్మాఱు వ్రాసిన
లిపి తుడువవు దయ ♦ లేని చేత
బ్రహ్మలిపి దుడువ ♦ వశముగా దన లేవు
బ్రహ్మకు వ్రాసిన ♦ వాఁడ వయ్య
యజమాను దయగల్గ ♦ నడ్డమే యితరంబు
నందఱు చూడరె ♦ యాదరమున
తే. బ్రహ్మలిపినిఁ దుడిచి పర ♦ బ్రహ్మమూర్తి
భక్తియును జ్ఞానమును ముక్తి ♦ వ్రాయుమయ్య
ప్రార్థనము నిన్నుఁ జేసిన ♦ ఫలముగాను
యోగ..................... రామ. 100

సీ. తనువుండుదనుకను ♦ దప్పక నన్నుఁ బ్రోవు
భయ దుఃఖ రోగ వి ♦ వర్జితునిగ
సంసారవిషయముల్ ♦ సౌఖ్యంబుగాఁ జేయు
నాది కా దీయిల్లు ♦ నీదెకాని
తప్పులన్నిటిఁ గాచి ♦ దైన్యంబు నెడఁబాపు
మెప్డు నీపదభక్తి ♦ నెగడఁ జేయు
మేజన్మమున నైన ♦ నెట్టివేళల నైన
నినుఁ జూచు విధమును ♦ నేర్పుమయ్య
తే. కలుపు మీఁక నన్ను నీలోనఁ ♦ గనికరమున
నెందఱినో కాచి రక్షించి ♦ యేలు నీవు
నన్ను రక్షింప కుండుట ♦ న్యాయ మగునె
యోగ..................... రామ. 101

సీ. ఇన్నాళ్లు వీఁడు న ♦ న్నెదఁ దలంచుట లేద
నుచు నుపేక్షించుట ♦ యుచిత మగునె
యాఁకలి వేసిన ♦ యపుడెకా తల్లిని
గూర్చి శిశువు కడు ♦ గోలుపెట్టుఁ
దండ్రి యిచ్చిన యాస్తిఁ ♦ దగులఁబెట్టినఁగదా
తనయుఁడు బ్రతిమాలుఁ ♦ దండ్రిఁజేరి
నాకు నీవిచ్చిన ♦ నాణ్యమా జన్మమున్
బాపకృత్యములచేఁ ♦ బాడుచేసి
తే. ఇపుడు నీయందఁ జేరితి ♦ నేలు తండ్రి
యార్తుఁడను జననివలె న ♦ న్నాదరించు
ప్రాణములు పోయిననుసరే ♦ వదల కయ్య
యోగ.....................రామ. 102

సీ. ప్రొక్కుల నాపద ♦ ప్రొక్కులం చనుమాన
మొందున్న నన్నిపు ♦ డోమి పిదప
నెపుడు నిన్వీడిన ♦ నపుడె యోఁచఁగరాదె
యింతలో మునిఁగిన ♦ దేమి గలదు
నిఖిల లోకంబుల ♦ నిండియుండిన నిన్నుఁ
దప్పించుకొనుటెట్లు ♦ ధైర్య మూను
ఏకాకివై యుండ ♦ లేకేకదా సృష్టి
సంసృతిలోలులఁ ♦ జనుమ యోఁచ
తే. పోని, నీ క్షేత్రమెల్లెదఁ ♦ బొగడు నట్లు
శతక మొక్కటి చెప్పి తా ♦ శక్తితోడఁ
గొన మెచ్చి న న్నకట ♦ కావ వలదె
యోగ.....................రామ. 103

సీ. నాపైనిఁ గృపలేక ♦ నడిపింపకుండిన
నడుగను నిన్ను నే ♦ నంతగాను
దప్పులేకున్నను ♦ దప్పుపట్టు నసూయ
పరులనుగూర్చి నే ♦ పలుక నేమి
అల్పజ్ఞుఁడగు వాని ♦ కల్పనయని దీని
నాదరింపనివారి ♦ నట్టె విడుతుఁ
దప్పు లుండిన నెంచ ♦ కొప్పులే కొనుచు నీ
శతకంబుఁ జదువు స ♦ జ్జనుల నెపుడు
తే. సత్కృపాదృష్టి వీక్షించి ♦ సరభసముగ
నాయు రారోగ్య భాగ్యమ్ము ♦ లందఁజేసి
శాశ్వతానంద సౌఖ్యమ్ము ♦ సంగు మయ్య
యోగ......................రామ. 104

సీ. నారినిఁ బరిమార్చి ♦ నారినిఁ గాపాడి
నారినిఁగట్టితి ♦ నారి కొఱకు
వనచరులను గూల్చి ♦ వనచరుఁగూడి వ
నచరు దునిమితి వ ♦ నచరుఁడవయి
రాజవైరి కులేశ ♦ రాజశేఖర మిత్ర
రాజవైరి విభంగ ♦ రాజహంత
విశ్వరక్షకుఁడవై ♦ విశ్వఘాతకుఁ డౌదు
విశ్వాండ వగుచు న ♦ విశ్వుఁ డౌదు
తే. నీవిరుద్ధచరితకు నా ♦ నేర్చి నేర
ని పదగుంభన శతకమొ ♦ నే టఁటంచుఁ
బూర్తి చేయించి నందుకుఁ ♦ బొగడుచుందు
యోగ......................రామ. 105

సీ. కావ్యలక్షణ మెఱుం ♦ గని మత్కవిత్వంబు
విద్వన్నుతమ్ముఁ గా ♦ వించి నావు
స్నాన సంధ్యలు మాని ♦ సంకటపడునట్టి
నాహృదయమునందు ♦ నాటుకొంటి
నేపుణ్య మెఱుఁగని ♦ యీపాపి నందఱు
మెచ్చునటుల్ కీర్తి ♦ దెచ్చినావు
ఖాతజహృద్రోగ ♦ వాహిని మునిఁగెడు
కించిద్జ్ఞ నిట్లు పే ♦ లించినావు
తే. ఎపుడు పోవునో ప్రాణ మం ♦ చెంచువాని
నింక నిటునిల్పి పూర్తి చే ♦ యించినావు
ఇట్టి కరుణాంతరంగు ని ♦ న్నెటు నుతింతు
యోగ........................రామ. 106

సీ. వందన మనిరుద్ధ ♦ వందన మచ్యుత
వందనము ముకుంద ♦ వందనంబు
వందనము పవిత్ర ♦ వందనము విచిత్ర
వందనముయ మిత్ర ♦ వందనంబు
వందనమాత్మేశ ♦ వందనము మహేశ
వందనము పరేశ ♦ వందనంబు
వందనము ప్రకృతి ♦ వందనము వికృతి
వందన మురుమూర్తి ♦ వందనంబు
తే. వందనము హృషీకేశుఁడ ♦ వందనంబు
వందనము కృష్ణ కేశవ ♦ వందనంబు
వందనము పరమానంద ♦ వందనంబు
యోగ........................రామ. 107

సీ. మంగళ మో రామ ♦ మంగళ మో శ్యామ
మంగళ మరిభీమ ♦ మంగళంబు
మంగళము శివాత్మ ♦ మంగళ మధ్యాత్మ
మంగళము మహాత్మ ♦ మంగళంబు
మంగళ మో శౌరి ♦ మంగళ మో సూరి
మంగళము మురారి ♦ మంగళంబు
మంగళము బుధాయ ♦ మంగళము ధృవాయ
మంగళ మమలాయ ♦ మంగళంబు
తే. హారతింగొను మాది మ ♦ ధ్యాంతరహిత
హారతింగొను విశ్వేశ ♦ యఘవినాశ
హారతింగొను మవ్యయా ♦ హ్లాదరూప
యోగ... ... ... ... ... ... ...రామ. 108

గద్య

ఇతి శ్రీ తిలశైల రామయోగి ప్రసాదలబ్ధ కవితాధారేయ
ఒకటలి యాంగ్లేయోన్నత పాఠశాలా సహాయోపా
ధ్యాయ మండలీక సీతారామయ్య ప్రణీతంబైన
యోగి రామ శతకము
సంపూర్ణము.

శ్రీ పరమేశ్వరార్పణమస్తు.

☞ టిప్పణి వెనుకకుఁ గలదు చూడుఁడు.

# టిప్పణి

23వ పద్యము—తే.గీ. గణితశాస్త్రమందు బిందువు (point) నిడుపు వెడల్పులేనిదై వైశాల్యములేని చిహ్నమని చెప్పఁబడును. వ్యాప్తి (యనగా వైశాల్యము) లేని యిట్టి బిందువునకుఁ గొంత వ్యాప్తిఁ గలుగఁజేసి బోధకులు తమ బోధితులకు బోధించుదురు. అట్లే రూపహీనుఁడైన పరమేశున కేదో యొకరూపము కల్పించి బోధించుదురు. అట్టి రూపమునకుఁ బరమేశునకుఁ గల శక్తుల నారోపించి గాథలను గలిపెదరు. ఆ గాథల సత్యాసత్యములతో నిమిత్త ములేదు.

38వ పద్యము—పరమాత్మనుండి మొట్టమొదట వెలువడినది యగ్ని యగుటచే పరమాత్మకు మిక్కిలి సన్నిహితమైన యగ్ని నే పరమాత్మయొక్క దృశ్యరూపముగా భావించి యగ్నితేజస్సును బరమాత్మగాఁ బూజించు చున్నారు. "నీవారసూకవత్తన్వీ పీతాభాస్వత్యణూపమా, తస్యాశ్శిఖాయామధ్యే పరమాత్మా వ్యవస్థితః" అను మంత్రపుష్ప వాక్యము గమనింపుఁడు. అందుకనియే మన వారు సూర్యుని బూజించుట, దీపారాధనచేయుట, ఔపాసనము, లక్షవర్తులవ్రతము మొదలగు జ్యోతిప్రధానము గలవి

యందుకొఱకే పుణ్యదాయకములైనవి. అగ్నిజ్వాలయందుఁ బరమేశుఁడవ్యక్తము (latent) గా నుండును.

“అగ్నియచేతన.........గాదె.”

ఉదా:—చమురుగల వత్తిని వెలిగించిన నాచమురునందుగల యగ్ని ప్రజ్వలించి చమురంతయు నగ్నిరూపముగా మాఱును.

“పూర్ణ పూర్ణ............శేషమై.”

పూర్ణమనగా సున్న. సున్నను సున్నచే హరించిన సున్నలే లబ్ధమై సున్నయే మిగులును. అట్లే పరమేశుఁడు సృష్టిలోఁ బ్రతివ్యక్తియందుఁ బూర్ణుఁడై తాను ప్రత్యేకముగాఁ బూర్ణుఁడై యున్నాడు.

పద్యములు 39, 40, 73, 74. సృష్టిలో నన్నియు పంచభూతాత్మకమై యున్నవి. అందు పృథ్వి, జల తత్వములు స్థూల దేహములుగాను వాయు రాకాశాగ్ని తత్వములు సూక్ష్మ దేహములుగాను



జెప్పబడినవి. ఈ పంచభూతములు ప్రక్క కనబఱచినట్లుగా నొకదానినుండి యొకటి వెలువడినవి. లయ మగునపుడు విలోమముగా నొకటితరువాతనొకటి నశించి పరమాత్మయందు లీనమగును.

89వ పద్యము—బాల్యవివాహము. వివాహమునందు రెండు క్రియలు కలవు. ఒకటి కన్యాదానము, రెండవది వివాహము. పూర్వము కన్యను దానమిచ్చిన పిమ్మట వరుఁడు తనకిష్టము వచ్చినపుడు వధువును రజస్వలానంతరము వివాహమాడుచుండెను. కాని యొక్కొకయెడ కారణాంతరములచే నావరుఁడు తన వధువును వివాహమాడక విడిచిపుచ్చుటచే సంసారులకు చిక్కులు గలుగుచుండెను. అంత సంస్కర్తలు కన్యాదాత గృహమందు కన్యాదానమైన వెంటనే వరునింటియందు వివాహకార్యము జరుగునట్లేర్పాటు చేసిరి. ఇది కాలానంతరమం దసౌకర్యముగాఁగానవచ్చుటచే కన్యాదానస్థలమందే వరుని ధనముతో వివాహకార్యము జరుగవలసినదిగా నిర్ణయింపఁ బడెను. రానురాను మొగపెండ్లివారి నిర్బంధముచే కన్యాదాతయే వివాహపు ఖర్చులుకూడ భరించవలసివచ్చెను. ఇప్పుడు వరకట్నములుగూడ నిచ్చుకొనవలసి వచ్చినది. పూర్వులు కన్యాదానమునకే ప్రధానమిచ్చుటచే పైచెప్పిన విధా

నముగా బాల్యవివాహములనగా రజస్వలాపూర్వవివాహములు తటస్థించినవి. టెక్కలి తాలూకా కవితాగ్రహారం కాపురస్తులు వేదశాస్త్రపండితులు నైన కీర్తిశేషులు బూర్లె కన్నావధానులు గారిచే సుమారు ముప్పది సంవత్సరముల క్రిందట విని తెలిసికొని యుంటిని. అప్పటి కాతనివయస్సు సుమారెనుబది సంవత్సరములు. శాస్త్రవేత్త లిందువిషయమై పరిశీలించెదరు గాక.



శ్రీరామాప్రెస్, రాజమండ్రి.